అభినవసరస్వత్యనుబంధం—

# సిద్ధాంతసంగ్రహము

అధికరణత్రయాత్మకము

—:o:—


గ్రంథకర్త

తర్క-వేదాంతవిశారద

ముదిగొండ వేంకటరామశాస్త్రి



ఓంకారమన్దిరము

(స్వస్థానము)





గుంటూరు చంద్రికా ముద్రణాలయమున

ముద్రితము

1934

ఓమ్

# భూమిక

ధార్మికవిద్వత్పురుషధౌరేయులారా !

ఆర్యమహాశయులారా !!

శ్రీ శ్రీ శ్రీమజ్జగద్గురు పుష్పగిరిశాఙ్కరపీఠాధీశ్వర శ్రీమదభినవోద్దండవిద్యానృసింహభారతీస్వామివారిపంపునఁ దత్సంస్థానభూశాఖావ్యావహారికసర్వాధికారులును, గుంటూరుమండలవర్ణాశ్రమధర్మోద్ధారకసంఘకార్యదర్శులు నగు బ్రహ్మశ్రీ వినపాముల లక్ష్మీనరసింహమహాశయులచే నాకుఁ బంపఁబడి యీక్రిందఁ బ్రచురింపఁబడిన పత్రికకుఁ బ్రత్యుత్తరరూప మగు నీ (యధికరణత్రయాత్మక) 'ధర్మసిద్ధాంతసంగ్రహము' ధార్మికవిద్వదుచ్ఛిష్టమును, సద్గురుకరుణారసపరిపుష్టమును, ధర్మాసక్తిమాత్రవిశిష్టము నగుటచే, దయాళువు లగుపండితు లిందలి గుణలేశముల నెల్ల బహుజ్ఞు లగుధార్మికవిద్వన్మహాశయాదులవనియు, దోషపరంపరలెల్ల నల్పజ్ఞుఁడ నగునావి యనియు, గమనించి, పునర్విశోధనానుకూలము లగుయుష్మదాశీర్వచఃప్రపణములచే నన్నుఁ గృతకృత్యుని జేయఁ బ్రార్థించుచున్నాఁడ.

చౌటపాపాయపాలెము
(అగ్రహారము)
1—8—1938.

ఇట్లు విద్వద్విధేయుఁడు,
ముదిగొండ వేంకటరామశాస్త్రి,
ధర్మసిద్ధాంతసంగ్రహకర్త.

# శ్రీవారికిఁబంపఁబడినపత్రిక.

శ్రీ చంద్రమౌళీశ్వరస్వామినే నమః

వినపాముల లక్ష్మీనరసింహము,
శ్రీ పుష్పగిరిసంస్థాన ముక్త్యార్
యేజంటు & రివిన్యూ అధికారి

రైలుపేట, గుంటూరు,
తేది 17-7-'38.

శ్రీమద్వేదశాస్త్రసంపన్నులగు బ్రహ్మశ్రీ సత్తెనపల్లితాలూకా వర్ణాశ్రమధర్మోద్ధారకసంఘ ప్రధానకార్యదర్శి, తర్క-వేదాంత విశారద, ముదిగొండ వెంకటరామశాస్త్రిగారి సన్నిధికి.

శ్రీజగద్గురు పుష్పగిరిపీఠాధ్యక్షులసన్నిధిసేవకుఁడు వినపాముల లక్ష్మీనరసింహము ప్రణామపూర్వకముగా వ్రాయుపత్రిక :-

ఆర్య !

ఇప్పుడు భారతదేశీయశాసననిర్మాణసభలో 'నస్పృశ్యస్పర్శచర్చయుఁ, జండాలదేవాలయప్రవేశచర్చయు, వివాహవిచ్ఛేదచర్చయుఁ' గావింపఁబడుచుండుట పత్రికలవలన సర్వజనవిదితముగదా. ఈ త్రివిధచర్చలలోఁ జండాలదేవాలయప్రవేశమునకుఁ బ్రవేశపెట్టఁబడినబిల్లు మున్ముందు, అగస్టు నెలలో శాసనసభలోఁ జర్చకురానున్నది. బిల్లును బ్రవేశపెట్టిన రంగయ్యరుగారును, నిదివఱకు వివాహవయోనిర్ణయశాసనమును ప్యాసుచేయించిన హరవిలాసశారదాగారును ప్రజాభిప్రాయమునిమిత్తమింకను గాలహరణ మొనర్పఁబనిలేదని, యీ పర్యాయ మీబిల్లు చర్చకుఁ దెచ్చి ప్యాసుచేయించుటకు మిక్కిలి ప్రయత్నించుచున్నారు.

గడచిన మార్చి నెలలో నఖిలభారతవర్ణాశ్రమస్వరాజ్యసంఘము వారి పక్షమున నలుబదిమందికిఁ బైఁగాఁ బ్రముఖులు శ్రీగవర్నరుజనరలుగారిదర్శనముచేసి శాసనసభలలో మతసంబంధమయినబిల్లులు ప్ర

వేశపెట్టుకొని చర్చించుట కనుమతి నీయవలదని ప్రార్థించఁగా బిల్లు ప్రవేశపెట్టకుండ నాపుటకు [illegible] లేదుగాని ప్రవేశపెట్టి[illegible] మాత్రముననే బిల్లు చర్చింపఁబడుటకు సెలవీయఁబడదనియు, నీబిల్లు చర్చకు రాకపూర్వము మతాధికారు లగుమతగురువులయొక్కయు, దేవాలయధర్మకర్తలయొక్కయు, మహామహోపాధ్యాయాది బిరుదాంకితు లగుపండితులయొక్కయు నభిప్రాయములు తెప్పించుకొని విచారించియే బిల్లు చర్చింపవలసినయగత్య మున్నది లేనిది తీర్మానించెదమనియు సెలవిచ్చియున్నారు. ఈ చండాలదేవాలయప్రవేశశాసనము రాఁబోవు అగస్టు 24 తేదిని జర్చకు వచ్చునని తెలిసి, అసెంబ్లి మెంబర్లలో సనాతనధర్మాభిమాను లగు శ్రీయుత రామకృష్ణయ్యగారీబిల్లును పీఠాధిపతులకుఁ బండితులకు దేవాలయధర్మకర్తలకు మాత్రమే యభిప్రాయములనిమిత్తము పంపవలసినదిగాను సర్వజనాభిప్రాయము గనుగొనుటకు జిల్లాకలెక్టరులకుఁ బంపవలసినదిగాను దేవాలయములయందును దేవతాపూజలయందును లేశమేని నమ్మకములేని యార్యసమాజ, బ్రాహ్మసమాజ, హిందూమహాసభవంటి సంస్థలలోని వారియభిప్రాయములను గోరఁగూడదనియు సవరణ నుపపాదించియున్నారు. దైవానుగ్రహమున నీయుపపాదనము నెగ్గునో లేక సర్వతాభిప్రాయములకుఁ బంపఁబడునో ముందు చర్చలోఁగాని తేలదు.

శ్రీజగద్గురు పుష్పగిరి పీఠాధిపతులు తమయభిప్రాయమును వర్ణాశ్రమధర్మాభిమాని బహుపండితాభిప్రాయసంప్రతిపత్తిపురస్సరముగాఁ దెలుపఁదలంచి తమబోటి సుప్రసిద్ధులును సనాతనధర్మనిరతులు నగు పండితుల యభిప్రాయములను వ్రాఁతమూలకముగాఁ దెప్పించుటకు నా కాజ్ఞ యొసంగియున్నారు. ఇది ధర్మవిప్లవసమయము. ఉపేక్షింపఁదగినది కాదు. శ్రుతిస్మృతిప్రమాణబద్ధుల కిదివఱకియ్యవి నిర్ణీతాంశములైనను నీకాలమందుఁ జండాలదేవాలయప్రవేశాదులు ప్రమాణసిద్ధము లనివాదించుమహాత్ములు కొంద ఱుండుటనుబట్టి యా

పత్రిక వ్రాయవలసినయవసరము గలిగినది. కావున దావిూయుత్తరము తమ కందినయొకవారములోఁగా నీవిషయమైనతమనిర్ణయమును హేతుప్రమాణసహితముగా వ్రాసి నాకుఁ బంపఁ బ్రార్థించుచున్నాఁడను.

అసెంబ్లిమెంబర్లలో సనాతనధర్మాభిమానులయభిప్రాయసంస్థాపనమునకై యీ నిర్ణయపత్రములు క్లుప్తపఱచి తెప్పించి వీలయినయెడల నాంగ్లేయభాషలోనికిఁ బరివర్తనము చేయించి, యచ్చువేయించి, అసెంబ్లి మెంబర్ల కందఱకు సకాలమున నందఁజేయవలెనని శ్రీవారు కోరియున్నారు. ఈసమాచారము శ్రీవారు నాకుఁ దెలిపిన వెంటనే తమకు వ్రాసికొన్నాఁడను. వ్యవధితక్కువగా నున్నదిగాన దయయుంచి వారముదివసములలోఁగానే తమయభిప్రాయవ్యాసమును బంపుదురని ప్రార్థన.

చిత్తగించవలెను.

నైలుపేట, గుంటూరు,<br>**17-7-'33**

ఇట్లు విన్నవించు విధేయుఁడు,<br>వినపాముల లక్ష్మీనరసింహము.



ఓమ్

# ధర్మసిద్ధాంతసంగ్రహము



(అధికరణత్రయాత్మకము)

## ౧. అస్పృశ్యత్వాధికరణము.

శ్లో॥ నారాయణసమారమ్భాం శఙ్కరాచార్యమధ్యమామ్
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్ ॥

శ్లో॥ అనాద్యవిద్యావ్యామోహతమస్తోమరవిద్యుతి
స్తుమ స్తచ్ఛాఙ్కరం ధామ కర్మబ్రహ్మోభయాత్మకమ్॥

శ్లో॥ శ్రీమదాద్రిమబ్రహ్మవిశ్వనాథాభిధగురూ భజే
శాకాదబ్రహ్మవిజ్ఞానకారకా భవతారకా ॥

---

విషయము—చండాలాస్పృశ్యత.

సంశయము—తదస్పృశ్యతను వారింపవలయునా? పాటింపవలయునా?

—* పూర్వపక్షము *—

I

అస్పృశ్యత యనునది మలమూత్రాదులు, దుర్వ్యాధిదోష దూషితదేహులు, నితరవిషపదార్థములు, మున్నగు ప్రత్యక్షోపద్రవకరము లగువానివిషయములోఁ బాటింపఁదగినదియేగాని, సమాన మానవజాతీయులలోనే కొందఱ (చండాలుర) విషయములో యావజ్జీవముగూడఁ బాటింపఁదగదు. అట్లొనర్చుట యన్యాయము. అతి ఘోరమును.

II

అట్లనాదిగ జనసామాన్యములో నాచార ముండినను నయ్యది మూఢాచారమేగాని యోగ్యాచారము గాదు. కావున విశ్వమానవ

సోదరభావభంజక మగునట్టియస్పృశ్యతను నివారించితీరవలయును. వేదశాస్త్రములలో (శ్రుతిస్మృతులలో) నట్టినియతి యుండుటచే నా యస్పృశ్యతను బాటించుచుంటి మందురా? ప్రత్యక్షానుమానవిరుద్ధము లగునాగ్రంథములే యప్రమాణము లనకతప్పదు.

III

ఒకవేళ నాగ్రంథముల నమ్మి విచారించినను, నీక్రిందిప్రమాణ ములఁ గనుఁడు:—

(1) బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ । బాహూ రాజన్యః కృతః ।
ఊరూ తదస్య యద్వైశ్యః । పద్భ్యాగ్ం శూద్రో అజాయత ।
తైత్తిరీయకృష్ణయజుర్బ్రాహ్మణము (అరణ్యకము)

(2) 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః.' భ.గీ. 4-11

ఇత్యాదిశ్రుతిస్మృతులలోఁ దత్తద్వృత్తుల (గుణకర్మల) ననుస రించి చాతుర్వర్ణ్యకల్పనము చేయఁదగినదియేగాని వేఱుగాదు. మఱియు నిటఁ బేర్కొనఁబడిన చతుర్వేదగతపురుషసూక్తవచన ములకు యథార్థవేదవేత్త లగుమహాశయు లనేకులు "ముఖాదుల వలన బ్రాహ్మణాదులు పుట్టిరనుట, విద్యను, దేహబలమును, ఓర్పును, సేవను, వరుసగా మోము, భుజములు, తొడలు, కాళ్ళు, సూచించునుగాని యాయా యవయవములనుండి (ప్రకృతివిరుద్ధ ముగ) నాయావర్ణములవారు పుట్టిరని కాదు. కావునఁ బైగుణములు క్రమముగ నేయేవ్యక్తులయం దుండునో, ఆయావ్యక్తు లాయావర్ణ ముగలవా రనియె భావముగాని వేఱుగా" దని నిర్వచించిరి. వర్ణ మనఁగా రంగు. ఇందులకు—

(3) విప్రశ్శుక్లో నృపో రక్తః పీతో వైశ్యోఽన్త్యజోఽసితః
శంకరాచార్యకృతసర్వసిద్ధాంతసంగ్రహము. 49 శ్లో.

(4) బ్రాహ్మణానాం సితో వర్ణః క్షత్రియాణాంచ లోహితః ।
వైశ్యానాం పీతకో వర్ణ శ్శూద్రాణా మసిత స్తథా ॥
మహాభారతశాంతిపర్వము. అ 188, శ్లో 5

ఇత్యాదు లనేకములు ప్రమాణములు. ఇంతియేకాని పైగుణ కర్మలకంటెను, రంగుకంటెను, జాతినిరూపకచిహ్నములు వేఱుగ నేమియు లేవు. ఇంతియేకాక మానవు లందఱును జన్మతో బ్రాహ్మణులే యైరనియు, నాయాగుణకర్మలవలన క్షత్రియాదులుగా మారితిరనియు నీక్రిందిప్రమాణమువలనఁ దెలియుచున్నది.

(5) "న విశేషోస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదం జగత్ ।
బ్రహ్మణా పూర్వసృష్టంహి కర్మభి ర్వర్ణతాం గతమ్॥ 10
కామభోగప్రియా స్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః।
త్యక్తస్వధర్మా రక్తాంగా స్తే ద్విజాః క్షత్రతాం గతాః॥ 11
గోభ్యో వృత్తిం సమాస్థాయ పీతాః కృష్యుపజీవినః ।
స్వధర్మా న్నానుతిష్ఠంతి తే ద్విజా వైశ్యతాం గతాః॥ 12
హింసానృతప్రియా లుబ్ధా స్సర్వకర్మోపజీవినః ।
కృష్ణా శ్శౌచపరిభ్రష్టా స్తే ద్విజా శ్శూద్రతాం గతాః॥ 13
ఇత్యేతైః కర్మభి ర్వ్యస్తా ద్విజా వర్ణాంతరం గతాః॥

మహాభారత శాంతిపర్వము-188 అధ్యా.

ఇట్లే

(6) బ్రహ్మవా ఇద మగ్ర ఆసీత్-ఏక మేవ తదేకగ్ం
స న్నవ్యభవత్ ... ... శూద్రేణ శూద్రః

బృహదారణ్యకోపనిషత్తు 3-4=11, 12, 13, 14, 15.

ఇత్యాదిబృహదారణ్యకశ్రుతివాక్యములుగూడఁ బై భారత శ్లోకార్థమునే చెప్పుచున్నయవి. కావునఁ బురుషసూక్తాదులలోఁ జేర్పఁబడినరీతిగ.

పూర్వోక్తప్ర.(2)చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః।
భ-గీ. 4-11

(7) బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప ।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః భ-గీ 18-4.

ఇత్యాదిప్రమాణవాక్యములలో బ్రాహ్మణాదులనఁగా నాయా విద్యాదిగుణములు నాయారంగులు గలవ్యక్తులనియే తేలుచున్నది. కాని జన్మముచేతనే యొకజాతి లేక వర్ణ మేర్పడుటగాని యావజ్జీవ మస్పృశ్యత పాటింపఁదగిన (పాపయోనులగు) పంచమాదిజాతు లున్నట్లుగాని, యెచ్చటను గనుపింపదు. కావుననే-

(8) బ్రాహ్మణః క్షత్రియో వైశ్య స్త్రయో వర్ణా ద్విజాతయః।
చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమః॥

మనుస్మృతి. అ-౧౦. శ్లో॥ 4.

ఇట్లు మనువు పంచమజాతియే లేదనిగూడ వచించె. కావున నెచటనైనఁ జండాలపద ముండినచో నీచవర్తనుఁ డగుమానవుఁ డనియు, బ్రాహ్మణాదిపదము లుండినచో శమదమాదులు గల మానవులనియు శాస్త్రార్థము సరిచూచుకొనవలెను. ఇందుకు-

(9) న జాతిః పూజ్యతే రాజన్! గుణాః కల్యాణదాయకాః।
చండాలమపి సద్వృత్తం తం దేవా బ్రాహ్మణం విదుః॥

మనుస్మృతి.

ఈవచనమే ప్రమాణముగావునఁ జండాలాదిజాతిగాని తదస్పృశ్యతగాని శాస్త్రసిద్ధముగూడఁ గాదు-

## IV

(10) శూద్రా దాయోగవః క్షత్తా చండాలాః ప్రతిలోమజాః
వైశ్యాయాం క్షత్రియాయాంచ బ్రాహ్మణ్యాంచ యథాక్రమాత్.

దేవలస్మృతి.

(11) చండాలదర్శనే సద్య ఆదిత్య మవలోకయేత్।
చండాలస్పర్శనే సద్య స్సచేలస్నాన మాచరేత్.

పరాశరస్మృతి.

(12) చండాలదర్శనే సూర్యదర్శనం; సంభాషణే బ్రాహ్మణాభి వ్యవహారః; స్సంస్పర్శనే సచేలస్నానమితి- సుమంతువు

౦డాలదర్శనే జ్యోతిషాం దర్శనమ్ ॥ బోధాయనస్మృతి.

యా మత్స్యాశ్వపాకాదే స్స్పృష్ట్వా స్నానేన శుధ్యతి ।
చత్వారింశత్పదా దూర్ధ్వం ఛాయాదోషో నవిద్యతే ।
స్మృతిరత్నాకరము.

ఇత్యాదిస్మృతివచనములవలన బ్రాహ్మణస్త్రీయందు శూద్రుని న జన్మించినవారు చండాలురనియు (వారిదర్శనస్పర్శనభాషణా కి వనికిరావనియు) నట్టిచండాలచ్ఛాయనుగూడ నలువదియడు లోపల స్పృశించిన స్నానముచేయవలయుననియు స్పష్టముగ యము గలుగుచుండ శాస్త్రములలోఁ జెప్పఁబడలేదను టెట్లు ౦ఁగును? అనెదరేమో- వినుఁడు. (ప్ర.8) "నాస్తితు పంచమ" ౨ పైనఁజూపఁబడిన మనువచనమున కివి యన్నియు విరుద్ధము ంలు చేఁ బక్షపాతబుద్ధులచేఁ గల్పితములైనవనిగాని యట్టివారిచేఁ ౨ ప్తములైనవనిగాని యనకతప్పదు.

ఈవచనములే ప్రమాణములైనచో శ్రుతులలో నెచటనైన వచన మేల గానుపించదు? స్మృతులపద్ధతు లిట్టివిగావుననే స్పరైకవాక్యత లేమిని

తేతు మానవా ధర్మా స్త్రేతాయాం గౌతమాః స్మృతాః ।
ద్వాపరే శంఖలిఖితాః కలౌ పారాశరాః స్మృతాః ॥

త్యాదిరీతులలోఁ గాలానుసారమనియు, దేశానుసారమనియు,- ౨ వారి బుద్ధ్యనుసారముగ నిబంధనకారులు పలువిధముల ౨ విరి. ఇట్టిస్థితిలో నేఁటికాలానుకూలముగఁగూడఁ గొందఱు శాలురు ధర్మపరివర్తన మేలచేయరాదు? కావునఁ ండాలజాతియుఁ దదస్పృశ్యతయు నశాస్త్రీయములనియుఁ, బరి ్ణీయములనియుఁ దేలుచున్నది.

V

మఱియు నత్యంతస్వల్పసంఖ్యాకము నతిపవిత్రము నగుబ్రాహ్మ ఆతిలోని స్త్రీల కతిగర్హ్య మగుశూద్రసంపర్కములో నతి ంశసంఖ్యాకచండాలజాతీయు లుత్పన్నులై రనిచెప్పుట ప్రి

కృతిస్వభావవిరుద్ధము, నవమానకరము ; కావున నిట్టివాక్యము లనాదరణీయములు. అట్లొప్పినను, "కారణగుణాః కార్యే సంక్రామన్తి" యనున్యాయమునఁ దజ్జాతీయుఁడు జననీజనకాన్యతర జాతీయుఁడగుట సరిగాని తదుభయాన్యతరాతిరిక్తజాతీయుఁడెట్లగు ను ? ఒకవేళ నట్లొప్పినను మాతాపితృన్యతరసమానగౌరవుఁ డగుఁగాని తదుభయాస్పృశ్యుఁ డెట్లగుచు ? అందుకుఁగూడ నంగీకరించినను, నట్లుత్పన్నుఁ డగువానికే యస్పృశ్యత వచ్చుఁ గాని తత్సంతానపరంపరలోనియుత్తమమానవులకుఁగూడ నెట్లు వచ్చును? ఇట్లాపరంపరను నిత్యముగ బహిష్కరించుట కడుంగడు శోచనీయముగాదా ? "తుష్యతు" న్యాయముచే మీరనినట్లెల్ల నంగీకరించినను, నాఁటిచండాలురే నేఁటిమాలమాదిగలని నిరూపించుట కేమిప్రమాణము ? వ్యవహారకాండములోఁగూడ "మాలపల్లె" "మాదిగపల్లె" యిత్యాది వ్యవహారమేగాని చండాల పదముతో వ్యవహారము లేదుగదా ! కావున నిట్టిపంచమాస్పృశ్యత్వాచారము దురాచారము. హేయము.

## VI

ఇట్టియాచారము దురాచారమగుటంజేసియే కాశీక్షేత్రమున శంకరాచార్యులవారికి విశ్వనాథుఁడు మాలవాని వేషముతోఁ గనుపించఁగా "గచ్ఛ-గచ్ఛ" యని యాచార్యులవా రనుటయు,నంత,

(16) అన్నమయా దన్నమయం హ్యథవా చైతన్యమేవ చైతన్యాత్ ।
యతివర ! దూరీకర్తుం కి మిహేచ్ఛసి గచ్ఛ గచ్ఛేతి ॥

మనీషాపంచకారంభశ్లోకము.

(17) "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢః" శ్రుతి.

అన్నట్లు సర్వోపాధులయం దాత్మ యఖండముగదా ? స్థూల శరీరము లన్నియుఁ బాంచభౌతికములేగదా ? ఇట్టిస్థితిలో యతి వయ్యు నవిచారపూర్వముగ నన్నుఁ దొలఁగుమనుట తగునా ? యని యామాలవాఁ డనుటయు. అంతట.

(18) జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరా యా సంవి దుజ్జృమ్భతే ।
యా బ్రహ్మాదిపిపీలికాంతతనుషు ప్రోతా జగత్సాక్షిణీ
సైవాహం నచ దృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాస్తి చేత్,
చండాలోస్తు సతు ద్విజోస్తు గురురి త్యేషా మనీషా మమ ॥

మనీషాపంచకము.

ఎవ్వఁ డిట్టియాత్మజ్ఞానము గలవాఁడో, వాఁడు నాగురువని గూడ శ్రీశంకరు లొప్పుకొనుటయుఁ దటస్థించెఁగదా ? కావున బాగుగ విచారించినచో.

(19) శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః. భ-గీ. 5-18.

ఇత్యాదిశాస్త్రానుసారముగఁ బంచమసోదరులయందుఁగూడ సమదృష్టి యభ్యసనీయముగాని మానవులలోని యొకరికొక రస్పృశ్యులని తలఁచుట పండితలక్షణముగాదు. సదాచారపద్ధతియుఁ గాదు.

## VII

ఒకవేళ మీరు చెప్పినట్లెల్ల నీశాస్త్రములన్నియు యథార్థములనియు నేఁటిమాలమాదిగలే యాచండాలురనియు నొప్పినను-

పూ-ప. (11) చండాలదర్శనే సద్య ఆదిత్య మవలోకయేత్.

పరాశరస్మృతి.

అనువచనము

(20) స్పృష్ట్వా దేవలకంచైవ సచేలస్నాన మాచరేత్. పరాశరస్మృతి.

అనువచనమువలె శుద్ధిప్రకరణపఠితముగాఁ గాన ధర్మానుష్ఠానకాలములలో బ్రాహ్మణులలోని పరస్పరాస్పృశ్యతవలెనే పాటింపఁదగినదనియే తేలునుగాని సర్వదా వా రస్పృశ్యు లనిచెప్పవీలుగాదు. అట్లుగానిచో దేవలకులఁగూడ సర్వదా యస్పృశ్యులనవలసివచ్చును. కాన నది సమన్వయపద్ధతిగాదు. కావుననే-

(21) న తైః స్సమయ మన్విచ్ఛే త్పురుషో ధర్మ మాచరన్ ।
మను 10 _ 53

(22) ధర్మానుష్ఠానసమయే చండాలశ్వపాకైస్సహ
దర్శనాదివ్యవహారం న కుర్యాత్ - కుల్లూకభట్టవ్యాఖ్యానము.

ఈరీతిగ మనుస్మృతితద్వ్యాఖ్యానముల ననుసరించిచూడ ధర్మానుష్ఠానసమయములలోఁ జండాలాదిసంబంధము కూడదని తెలియుచున్నదియేకాని యర్థ, కామ, మోక్షవ్యవహారములలో సర్వదా, సర్వథా, వారిముఖమునే చూడరాదు. వారితో మాటాడరాదు. వారినీడనైనఁ ద్రొక్కరాదని, మహాఘోరముగఁ జెప్పవీలుగాదు గావున నిట్టివాక్యములన్నియు ధర్మాచరణకాలీనచండాలాస్పృశ్యత్వవిధ్యర్థవాదములే.

## VIII

మాంసభక్షకు లగుటచే మాల లస్పృశ్యులైనచో, శ్వ, సూకర, మశక, మార్జారాదు లెట్లు స్పృశ్యములయ్యె ? వాతాపిభక్షకుఁ డగునగస్త్యుఁడు వంద్యుఁ డెట్లయ్యె ? మఱియు మాంసభక్షకులేగాక మతాంతరు లగుయవనుల శూద్రితుల్యులుగఁ జూచుటయు, మనహిందూమతములోని హరిజనసోదరుల నింతగా బహిష్కరించుటయు, నత్యంతాధర్మములు గావా ?

## IX

కావున నెచ్చటనైన దుర్గంధ, దుర్మల, దుర్వ్యాధి, దుర్విషాది క్రిత్యక్షోపద్రవహేతువు లగు వానియందే యస్పృశ్యత పాటింపవలెఁగాని సమానమానవు లగుమాలమాదిగల విషయములో యావజ్జీవ మస్పృశ్యత పాటింపరాదు.

——:0:——

ఇట్లు పూర్వపక్షములు రాఁగా నిందుపై యథాసంఖ్యముగ నుత్తరపక్షము నిరూపింపఁబడుచున్నది.

## —* ఉత్తరపక్షము *—

I

చక్షురాదిపరిమితేంద్రియార్థములలోను సుఖదుఃఖసాధనము లుండుటచే, సామాన్యమానవదృష్టి కందుఁ గొన్ని హేయములు మఱి కొన్ని యుపాదేయములుగఁ దోఁచుట సహజము. ఈమర్యాద ప్రకృతి స్వాభావికమగుటచేఁ బశ్వాదిసాధారణమే. ఇచట శాస్త్ర మనావశ్యకము. ఇఁక మానవుఁ డాధ్యాత్మికశక్తినొంది ముక్తుఁడు గావలెనన్న శాస్త్రానుసారియై నిగృహీతేంద్రియుఁడై యతీంద్రియాంతఃకరణమాలిన్యములఁ దొలఁగించుకొనవలె. అపు డాదర్శప్రాయ మగువిశుద్ధాన్తఃకరణమున నాత్మసాక్షాత్కారము గలుగును. దుఃఖము నశించును (నిఖిలబన్ధవిముక్తుఁడై నిత్యనిరతిశయనిజానన్దనిమగ్నుఁడగును.) ఈపరిణామికనే

(23) పరాం చిఖాని వ్యతృణ త్స్వయంభూ
స్తస్మా త్పరా ఙ్పశ్యతి నా న్తరాత్మన్ ।
కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష
దావృత్తచక్షు రమృతత్వ మిచ్ఛన్ ॥ కఠోపనిషత్తు 2-4-1

(24) ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయో ర్న వశ మాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ॥
భ. గీ. 3-34

(25) ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే భ. గీ. 2-65

ఇత్యాదిశ్రుతిస్మృతిశతములు చాటుచున్నయవి. కావున నట్టి యాధ్యాత్మికశక్తిసాధనముగఁ ద్రికాలజ్ఞు లగుమహర్షులు తమదివ్యదృష్టిచే శుభ్యర్థములఁ దెలిసికొని లోకహితార్థము భక్ష్యాభక్ష్య గమ్యాగమ్య, స్పృశ్యాస్పృశ్య నిబంధనల స్మృతిరూపముగ నొనర్చిరి. అచటఁ దర్కించు మనప్రాకృతదృష్టి చాలదు. వారి దివ్యదృష్టికిఁ ద్రైలోక్య, త్రైకాలిక, సంబంధి యావద్వస్తువులు వా ర్త

మానికములుగఁ, బరోవృత్తులుగ గోచరించును. అట్టి దివ్యదృష్టి యొకటి యున్నట్లు,

(26) దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్

భ. గీ. 11-8

(27) సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః భ. గీ. 11-27

ఇత్యాది భగవద్గీతావిశ్వరూపాధ్యాయపాఠకులకుఁ దెలియనిది గాదు. అట్టి దివ్యజ్ఞానమును ససాధనముగ

(28) సత్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వభావాధిష్ఠాతృత్వం, సర్వజ్ఞాతృత్వంచ పాతంజలయోగసూత్రము 3-48

ఇట్లు పతంజలిమహర్షి నిరూపించియుండె. కావునఁ గూపకూర్మ న్యాయమున నట్టిదృష్టి బూటకమనుటయుఁ, గృష్ణుఁడు మెస్మరిష్టనుటయు, సామాన్యమానవుఁ డనుటయు, బుద్ధిమంతుల లక్షణము గాదు. మిన్నుమిక్కిలి కేవల మూఢత్వమునే వెల్లడించును.

(29) అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితం ।
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్॥ భ.గీ. 9-11.

ఇట్లు భగవానుఁడే చెప్పియుండె. కావున నట్టిదివ్యదృష్టిచేఁ నిరూపితములై యాధ్యాత్మికశక్తిప్రధానములై స్వతస్సిద్ధములగు నైహికసుఖసాధనములుగూడ నైయున్న, భక్ష్యాభక్ష్య, స్పృశ్యా స్పృశ్యత్వాదినిబంధనముల నన్నిటినిగూడఁ బాటింపకునుటచేఁ బశుత్వమబ్బును. కొన్నిటిని బాటించి యనస్పృశ్యతమాత్రము పాటింపమనుటచే "నర్ధజరతి" న్యాయము పట్టును. కావున నట్టిశాస్త్రముల నైహికమాత్రదృష్టిచేఁ దోఁచినట్లెల్ల సమన్వయించుచు నట్టి సమన్వయములకు వీలుగానిచండాలాస్పృశ్యత్వాదులఁ బాటింపమనియు, నట్లు పాటించుట మూఢాచారమనియు, సౌహార్దనాశకమనియు వాదించుటకుఁ బారలౌకికగంధదూర మగుసుహాస్యోదర పరాయణదృష్టియె హేతువు గాన, శాస్త్రీయము లగుచండాలాస్పృశ్యత్వాదులఁ దొలఁగింపరాదు.

II

శబ్దప్రమాణము లగు వేదాదిగ్రంథములును, ననాదిశిష్టాచారవ్యవహారము లే ప్రమాణము లనినచో మనతండ్రితాతలచరిత్రల, నశోకచంద్రగుప్తాదివృత్తముల నెట్లునమ్మఁగలము? ప్రాదేశప్రాయములగు ప్రత్యక్షముగనున్న సూర్యాదిమండలముల భూమండలాధిక ప్రమాణములుగ నెట్లునిర్ణయింపఁగలము? రోగనివృత్తికై విషపాషాణమయములగు నౌషధముల నెట్లుసేవింపఁగలము? తుదకు నీపేరు నీ వెట్లుధ్రువపఱచఁగలవు? అట్లుగాక త్రైకాలికవృత్తములఁ జెప్పువేదములనే, నిర్భ్రాంతికముగ నప్రమాణము లనినచో నట్లనెడివారిశుష్కవచనము లెట్లుప్రమాణము లగును? కావుననే యిట్టిదుర్బలహేతువాదములతో సర్వలోకశ్రేయోమార్గదర్శకములగు శ్రుతిస్మృతుల నవమానించినవాఁడు లోకోపద్రవకరుండగుటంజేసి నాస్తికుఁడనియు, వానిని శిష్టసంఘమునుండి బహిష్కరింపవలెననియు–

(30) యోఽవమన్యేత తే మూలే హేతుశాస్త్రాశ్రయా న్నరః
స సాధుభి ర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః॥ మనుస్మృతిః

ఇట్లు మనువు చెప్పుచున్నాఁడు. ఇంత ఖండితముగ మనువు చెప్పుటకు

(31) ప్రత్యక్షే ణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే ।
ఏతం విదంతి వేదేన తస్మా ద్వేదస్య వేదతా ॥

(32) అవిహిత మప్రతిషిద్ధంచ తత్కాలఫలమ్ । నతు శాస్త్ర
చోదితం ప్రతిషిద్ధంవా తత్కాలఫలం భవేత్ ॥
...“తత్ప్రామాణ్య స్యాదృష్టవిషయత్వాత్ ॥
ప్రత్యక్షాదిప్రమాణానుపలబ్ధేహి విషయేఽగ్నిహోత్రాది సాధ్యసాధనసంబంధే శ్రుతేః ప్రామాణ్యమ్ ।
న ప్రత్యక్షాదివిషయే । అదృష్టదర్శనార్థవిషయత్వా త్ప్రామాణ్యస్య ॥ భ-గీ. 18-66. శాఙ్కరభాష్యము.

బ్రహ్మకాండములలో వాదులుగ మాటలాడఁజూచుట హాస్యాస్పదమును, నుత్తరవాదిమర్యాదాభంజకమునుగాదా ? కావున జిగీషువులైనచోఁ బైరీతిగ ముందు పరిశ్రమించి యోగ్యత సంపాదించుకొనవలె. అపుడే నదుత్తరములు సఫలము లగును. లేక జిజ్ఞాసువులైనచో శాస్త్రజ్ఞాన ముండవలెనను నియతి యుండదుగాని, వక్త్రు, శాస్త్రోభయవిశ్వాసముమాత్రము రోగికి వైద్యునియందువలె నత్యావశ్యక మగును. అపుడు యావద్రోగనివృత్తి యౌషధసేవవలె యావత్సంశయనివృత్తి యథోక్తానుష్ఠానపూర్వకశ్రవణావృత్తియు, శిష్టాచారానువృత్తియు నావశ్యకములు. కావుననే శ్రుతిరహితమగు కేవలయుక్తిచే సిద్ధాంతముగాదని (తర్కాప్రతిష్ఠానాత్ 2-1-11) ఇత్యాది బ్రహ్మసూత్రతద్భాష్యాదులలో సిద్ధాంతితమగుటచేతను సిద్ధాంతమందుఁ బుందోషదూషితప్రత్యక్షానుమానాదిసర్వప్రమాణములకంటె శ్రుతియే ప్రబలప్రమాణము, నాశ్రయణీయముగూడ నగుచున్నది. కావునఁ బ్రత్యక్షాదులచే శ్రుతి ఖండితము గాదు. శాస్త్రవిరుద్ధము లగుశిష్టాచారములనే శ్రేయఃకాము లనుసరింపవలెను.

## III

" బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ " ఇత్యాదివచనములకు వృత్తినిబట్టియె జాతి యేర్పడునని యర్థము చెప్పుట తప్పు. సమనంతరము:-

(36) చక్షోః సూర్యో అజాయత ।...। తస్మా జ్జాతా అజావయః
తైత్తిరీయారణ్యకము.

ఇత్యాదివచనములలో సూర్యాజావ్యాద్యుత్పత్తివలెనే బ్రాహ్మణాద్యుత్పత్తిగూడఁ బ్రత్యేకము చెప్పఁబడినదియెగాని మానవులందఱొకచోట నుత్పన్నులై ప్రత్యేకవృత్తులచేఁ దత్తజ్జాతీయులైనట్లు లేదుగదా ? చంద్రసూర్యాదు లెట్లుత్పత్తితోడనే విజాతీయులో యట్లే బ్రాహ్మణక్షత్రియాదులుగూడ ననియే సిద్ధాంతము.

(2-వ్రి) గుణకర్మములనుబట్టి నాల్గుజాతులవారిని గల్పించెననఁగా-
నీలపీతాదితంతుస్వరూపము లగునుపాదానములఁబట్టి నీలపీతాది
వస్త్రముల సృజించెనన్న ట్లర్థమెగాని వేఱుగఁ గుదురదు. అనిమిత్త
ముగ వాని కాయాగుణములు వృత్తులు వచ్చుటకు వీలులేదు
గదా? అప్పుడు ప్రాక్తనసృష్ట్యుపసంహారకాలమున కెవ్వరెవ్వరి
కేయేసంస్కారము లుండునో పునస్సృష్టిలో నాగుణకర్మలే హేతు
వులని చెప్పవలెను.

(37) ధాతా యథా పూర్వ మకల్పయత్.

తైత్తిరీయనారాయణోపనిషత్.

అనెడిశ్రుతి యీయర్థమునె యిచ్చును. అట్టిసృష్టియందైనను
విభాగాదికమందైనను బరమాత్మకుమాత్రమే యధికారమని

పూ. వ్రి (2) చాతుర్వర్ణ్యం మయాసృష్టమ్. భ. గీ. 4-11

(38) జన్మాద్యస్య యతః । బ్రహ్మసూత్రము 1-1-2.

(39) యతో వా ఇమాని భూతాని జాయన్తే తై॥ ఉపనిషత్.

ఇత్యాదిశ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. కానఁ జాతుర్వర్ణ్యవ్య
వస్థ వృత్తికృతమనియు మానవపరివర్తనీయమనియుఁ దలంపరాదు.
మఱియు,

పూ. వ్రి. (1) బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్. తై॥ అరణ్యకము.

ఇత్యాదిశ్రుతికిఁ బరమేశ్వరముఖాదులవలన బ్రాహ్మణాదులు
పుట్టిరని యర్థముకాదు. విద్యావిశాలురు బ్రాహ్మణాదులని మా
త్రమె తచ్ఛ్రుతితాత్పర్యమని పలువురు ప్రాచ్యపాశ్చాత్యపండితు
లభిప్రాయపడిరనియు, నదియె యర్థమనియు ననుకొనుటగూడఁ
బొరపాటే యగును. ప్రాచ్యపండితులలో వేదార్థప్రవక్తలు, శం
కర, రామానుజ, మధ్వ, విద్యారణ్య, మహీధరాదులు. వీరలలో-

(40) అథ త్రయోదశ మహా-బ్రాహ్మణోఽస్య ... అజాయత ఇతి।
యోఽయం బ్రాహ్మణజాతివిశిష్టః పురుషః సోఽయం అస్య

ప్రజాపతేః ముఖ మాసీత్ । ముఖా దుత్పన్న ఇత్యర్థః । యో౽యం రాజన్య స్స బాహు త్వేన నిష్పాదితః । బాహుభ్యా ముత్పాదిత ఇత్యర్థః । తత్ - తదానీం ప్రజాపతేః యా ఊరూ తదూ్రపః వైశ్యః సముత్పన్నః । ఊరుభ్యా ముత్పన్న ఇత్యర్థః । తథా పద్భ్యాం శూద్ర ఉత్పన్నః । ఇదంచ ముఖాదిభ్యో బ్రాహ్మణాదీనా ముత్పత్తిః । సప్తమకాండే " ప్రజాపతి రకామయత ప్రజాయేయేతి, స ముఖత స్త్రివృతం నిరమిమీత, త మగ్ని ర్దేవతాన్వసృజ్యత గాయత్రీఛందో రథన్తరగ్ం సామ బ్రాహ్మణో మనుష్యాణా మజః పశూనాం తస్మా త్తే ముఖ్యా ముఖతో హ్యసృజ్యన్త" ( కాం 7, ప్ర 1, అ 1 ) ఇత్యాదా విస్పష్ట మామ్నాతా. తత్పరత్వేనైవ యోజనీయేతి -

యజుర్వేదారణ్యక విద్యారణ్యభాష్యము.

(41) "ఇదానీం పూర్వోక్తానాం ప్రశ్నా నా ముత్తరాణి దర్శయతి । అస్య ప్రజాపతేః బ్రాహ్మణో బ్రాహ్మణజాతివిశిష్టః పురుషో ముఖ మాసీత్ । ముఖా దుత్పన్న ఇత్యర్థః । ( ఇత్యాదిగా నుపర్యుక్తానుపూర్వితోడనే ... ) ఉభే అపి తత్పరతయైవ యోజనీయే" (ఇత్యంతము భాష్యము కలదు.)

ఋగ్వేద విద్యారణ్యభాష్యము.

(42) అస్య చతుర్ముఖస్య బ్రహ్మణః బ్రాహ్మణో ముఖ మాసీత్ । ముఖస్థానీయో౽భవత్ । బ్రాహ్మణః అస్య ముఖా జ్జాత ఇత్యర్థః ... (ఇత్యాదిగా) ... శూద్రో అజాయత - అస్య పాదాభ్యాం శూద్రో అజాయత - ఉత్పన్నః । చతుర్ముఖ శరీరకానిరుద్ధనారాయణముఖబాహూరుపాదేభ్యః యజ్ఞనిర్వర్తకాః చత్వారో వర్ణా ఉత్పన్నా ఇత్యర్థః -

యజుర్వేద రామానుజభాష్యము.

(43) అస్య పురుషనామ్నో హరే ర్ముఖం - ముఖాత్ ముఖమిత్యాది ప్రథమా పంచమ్యర్థే । బ్రాహ్మణజా త్యుత్తమాభి

మానీ బ్రహ్మబ్రాహ్మణజాతిశ్చ ఆసీత్ ...(ఇత్యాదినా) ...
పద్భ్యాం శూద్రః శూద్రజాత్యుత్తమాభిమానీ, అశ్వినీదేవతా
సమూహశ్చ అవాంతరాభిమానినీ నృత్యాఖ్యదేవతా - శూద్ర
జాతిశ్చ అజాయత - ఋగ్వేద మధ్వభాష్యము.

(44) పూర్వోక్తప్రశ్నోత్తరమాహ - బ్రాహ్మణః - బ్రాహ్మ
ణత్వజాతివిశిష్టః పురుషః, అస్య ప్రజాపతేః ముఖమాసీత్ -
ముఖాదుత్పన్న ఇత్యర్థః ... (ఇత్యాదినా) ... తథాఽస్య
పద్భ్యాం శూద్రత్వజాతిమాన్ పురుషోఽజాయత- ఉత్పన్నః-
శుక్లయజుర్వేద మహీధరభాష్యము.

ఈశ్రుత్యర్థ మింతియేయని భ-గీ, 4-11, శ్లోకభాష్యములో శ్రీ శంకరాచార్యులవారుగూడ నిరూపించినవిషయము ముందు (53-54) దెలుపఁబడును. ఈరీతిగ ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమత ప్రవక్తలభాష్యములలో విరాట్పురుషునిముఖాదులవలన బ్రాహ్మణత్వాదిజాతివిశిష్టవ్యక్తులు పుట్టినవని విస్పష్టముగ నుండ, విద్యాది సంపత్తులు గలవారే బ్రాహ్మణులని యభిప్రాయపడి రనియను కొనుట పొరపాటనకతప్పదు. నిరుక్తమతప్రియసాంప్రదాయానభిజ్ఞుఁడును, నార్యసమాజమతావలంబియు నగుదయానందస్వామి గూడ -

(45) బ్రాహ్మణోఽస్య-అస్య పురుషస్య ముఖం యే విద్యాదయో
ముఖ్యగుణాః-తస్య భాషణోపదేశాదీని కర్మాణిచ సన్తి
తేభ్యో బ్రాహ్మణ ఆసీ దుత్పన్నో భవతి...(ఇత్యాదినా) ...
పద్భ్యాం పాదేంద్రియనీచత్వ మర్థా జ్జడబుద్ధిత్వాదిగుణేభ్యః
శూద్రః సేవాదిగుణవిశిష్టః పరాధీనతయా వర్తమానోఽజా
యత. జాత ఇతి వేద్యమ్. శుక్లయజుర్వేద దయానందభాష్యము.

ఈవిధముగ విద్యాదిసంపత్తులు గలవారే బ్రాహ్మణులని బలముగలవారే క్షత్రియులని యభిప్రాయపడినను విద్యాదిముఖ్య గుణోపలబ్ధిస్థానవిశేషములు పరమేశ్వరముఖాదులుగ నుత్ప్రేక్షించి, యట్టి విరాట్పురుషునిముఖాదులవలననే బ్రాహ్మణాదులు

పుట్టిరని వ్రాసిరిగదా? ముఖాదులవలన బ్రాహ్మణాదులు పుట్టు టెట్లు? ఇది లోకానుభవవిరుద్ధముగదా యనిశంకింపవలదు. లోకమం దనేకవిధము లగుసృష్టులు గోచరించుట లేదా? గోమయాద్యూష్మాదులచే వృశ్చికాదులును, కేశపాశోష్మాదులచే యూకాలిక్షమును(పేలు, ఈళ్లు) గలుగుచుండుట లేదా? ఇట్లుగాక ప్రస్తుతమానవసృష్టివలెనే సృష్ట్యాదియందుఁగూడ నుండవలె ననుకొనుట పొరపాటు. అట్లయినచో నేఁటిమానవులకువలెనే పరమేశ్వరునికిఁగూడ భార్య నంగీకరించనిది సృష్టి పొసఁగ దనవలసివచ్చును. ప్రకృతినె భార్యగా నంగీకరించినను, బరమేశ్వరునకుఁ దలిదండ్రులును, దత్పితరులును, దత్పితరులునుగూడ ననాదిగ నున్నారని యనవలసివచ్చును. ఇట్టివాదము పరమేశ్వరుఁ డున్నాఁడని నమ్మునట్టి యేమతములోఁగూడ నుండదుగదా.

(46) అజాయమానో బహుధా విజాయతే — తై. అరణ్యకము.

ఇత్యాదిశ్రుతిశతములవలనఁగూడ నీశ్వరుఁ డనాదియనియు, సకలకారణుఁ డనియుఁగదా సిద్ధించుచున్నది? ఇదిగాక మనయనుభవము ననుసరించియే సృష్ట్యుత్పత్తిని జేయవలె ననుకొనినచో భార్యను దలిదండ్రుల నంగీకరించి పరమేశ్వరునకు మానవస్రష్టృత్వమును గుదిర్చినను-

(47) పూ. ప్ర. 36. తస్మా జ్జాతా అజావయః। చంద్రమా మనసో జాతః।
చక్షో స్సూర్యో అజాయత। ... నాభ్యా ఆసీ దన్తరిక్షం। శీర్ష్ణో
ద్యౌ స్సమవర్తత. — తై. అరణ్యకము.

ఇత్యాదిగాఁ జెప్పఁబడినచరాచరాత్మకాఖిలప్రపంచస్రష్టృత్వమెట్లు పొసఁగునో విచారింపుఁడు. మఱియు-

(48) బ్రాహ్మణా బ్రాహ్మణస్త్రీభి స్సహ జాతా స్తపోధనాః।
తస్యాహస్తా త్సహస్త్రీభి ర్జజ్ఞిరే పృథివీభుజః. — సూతసంహిత 12-8

ఇత్యాదివచనములలో బ్రాహ్మణాదిస్త్రీపురుషు లొకేచోటు నుండి పుట్టుటచే సమానసోదరత్వమును బొందియుఁ దిరిగి జగ

దుత్పత్తికై దంపతిభావమును బొందిరనుట మఱింత మానవభావ విరుద్ధముగాదా? కావున మీరు చెప్పినట్లు నేటిమానవమర్యాదల ననుసరించియే సృష్ట్యారంభ మందుననుకొనుట పొరపాటు. పరమేశ్వరునివలన నిఖిలజగత్సృష్టి యెట్లు గలిగె ననినచో వినుఁడు-

(49) స ఈక్షత లోకాన్ను సృజా ఇతి — ఐతరేయోపనిషత్తు

(50) బహుస్యాం ప్రజాయేయేతి

(51) తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః. తై. ఉపనిషత్

పూ. ప్ర. 38. జన్మా ద్యస్య యతః। — బ్ర. సూ. 1-1-2

ఇత్యాదిశ్రుతిస్మృతిశతములవలన మాయోపహితచైతన్య స్వరూపుఁ డగుపరమేశ్వరునియొక్క మాయాపరిణామవిశేషరూప సంకల్పమాత్రముననే నిఖిలస్థూలసూక్ష్మజగత్సృష్టి గలుగునని తెలియవలెను. ఇట్లు జగదభిన్ననిమిత్తోపాదానకారణత్వము పరమాత్మకుఁ గలదని-

(52) ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాన్తానురోధాత్ — బ్ర॥ సూ॥ 1-4-18

ఇత్యాదిబ్రహ్మసూత్రతద్భాష్యములలోఁ జక్కఁగ నిరూపింపఁ బడినది. మాయావశమునమాత్ర మింతటియసంగతసృష్టి యెట్లు గలుగు ననఁగా -

(53) ఆత్మని చైవం విచిత్రాశ్చహి — బ్ర॥ సూ॥ 2-1-28.

ఇట్లు స్వప్నసమయమునఁ బ్రతిజీవుఁడు కల్పించుస్వాప్నికపదార్థములను దృష్టాంతముగ నిచ్చియున్నారు. ప్రకృతిరూపిణి యగు మాయ జడమును, నీశ్వరుఁ డసంగుఁడునుగదా? సృష్ట్యారంభమున లోకసృష్టివిషయకసంకల్పరూపప్రథమపరిణామ మెట్లు ఘటించు? ననిశంకింతురు. ఇందుకు సమాధానము - సృష్టియనఁగాఁ బ్రలయాంతరకృత్యముగదా! తత్పూర్వముగూడ నిట్టిసృష్టి గలదనకతప్పదుగదా! అట్టి పూర్వసృష్టిలోనియనంతకోటిజీవసంస్కారములు ప్రలయదశయందుఁ ద్రిగుణాత్మిక యగుప్రకృతియందు సర్గానుకూలకర్మప్రతిబంధక మగునేకర్మవేగముచే విలయావస్థను

బొందెనో యాకర్మవేగము గతించఁగనే, యథగ్నిపతితకందుకమున
కుత్పతనమువలె యథాపూర్వము నిష్ప్రతిబంధసర్జనానుకూలకర్మ
వేగముచే గాఢనిద్రావసానమున జాగ్రత్సంస్కారములువలె ననేక
జీవసంస్కారము లుద్బుద్ధము లగును. ఆయుద్బోధమునకే ప్రథమ
చలనమనియు, నీశ్వరసంకల్పమనియుఁ బేర్లు. అట్టియీశ్వరస్వభావ
రూపప్రకృతివలన సంస్కారాధీనములుగ నుద్భవించిన, శుద్ధసత్వ
గుణ, సత్వోపసర్జితరజోగుణ, తమఉపసర్జితరజోగుణ, రజఉపస
ర్జితతమోగుణాదులచే బ్రాహ్మణాది చాతుర్వర్ణ్యప్రభృతిసృష్టి
గలిగె ననియు, మానవయోనివలెఁ బ్రథమ సృష్టిలోఁ
దలిదండ్రు లనపేక్షితు లనియుఁ దెలియవలెను. ఇచట నొకే
విధ మగుభూమికిఁ దత్తత్సంస్కారవిశేషావచ్ఛేదక దేశవిశే
షములచే వజ్రవైదూర్యకంటకలోష్టాద్యుత్పాదకత్వము వలె
నవచ్ఛేదకీభూతము లగు తత్తద్బ్రాహ్మణాదిజాత్యభివ్యంజక
సంస్కార విశేష సహకృతమాయాంశములు పురస్కరించు
కొనియె యపాణిపాదుఁడుగ శ్రుతిప్రథితుఁ డగుపరమేశ్వరునకుఁ
గూడ బ్రాహ్మణాద్యుత్పాదకత్వమును దన్మూలకములగు పురుష
సూక్తాదులలోని ముఖాదినిరూపణము నవిరుద్ధములే. ఈ యర్థమునే-

పూ. ప్ర. 2 చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః
భ - గీ 4-11

పూ. ప్ర. 7 బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః॥ భ - గీ 18-41

ఈ స్థలములలో శంకరాచార్యులవారిభాష్యము చెప్పుచున్నయది.
మఱియు నీ విధమగుసృష్టియె -

పూ. ప్ర. 1 బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్. తై॥ ఆరణ్యకము

ఇత్యాదిశ్రుత్యర్థమనికూడఁ దద్భాష్యమున నుదాహరించిరి. ఇఁక
గుణములు, స్వభావప్రభవము లనుచోట -

(1) స్వభావము = ఈశ్వరప్రకృతి, తత్ప్రభవములు, దానివలన

నేర్పడినసత్త్వప్రధానత్వ, సత్త్వోపసర్జితరజఃప్రధానత్వాదిగుణములు, వీనివలన సృష్టి యనికాని-

(2) జీవప్రకృతి, విద్యాశౌర్యాదులు, తత్ప్రభవములు, వానికిఁ గారణము లగుసత్త్వప్రధానత్వ,సత్త్వోపసర్జితరజఃప్రధానత్వాదిగుణము లనికాని -

(3) జన్మాధాయకములుగ నుద్బుధ్యమానము లగుచున్నపూర్వభవకృతసుకృతాసుకృతజనితసత్త్వప్రధానత్వ, సత్త్వోపసర్జితరజఃప్రధానత్వాదులు, తత్ప్రభవములు, వానివలన జనించిన విద్యాశౌర్యాదిగుణము లనికాని -

పై ( భ - గీ, 18-41 ) శ్లోకములో నర్థము గ్రహింపవలెనని శ్రీశంకరభాష్యమువలనఁ దెలియనగును. ఇంతియేకాని, విద్యాశౌర్యాద్యుపలభ్యమానగుణముల ననుసరించి బ్రాహ్మణాదిశబ్దను లేర్పడినవనుట సరిగాదు. ఒకవేళ - 'తుష్యతు' న్యాయముచే నట్లంగీకరించినను, విద్యాదులు గలవారినే బ్రాహ్మణాదిశబ్దములచే వాడుటకుఁ గారణమేమి ? యనియుఁ గొందఱికి విద్యాదులు మఱికొందఱికి శౌర్యాదులు గలుగుటకుఁ గారణమేమి ? యనియుఁ బ్రశ్నలు కలిగినప్పు డనాదిసృష్టిపరంపరలో విద్యాదులు గలవ్యక్తులయందు బ్రాహ్మణాదిపదములు యోగరూఢములుగ వాడఁబడుచున్నవనియు, నిర్నిమిత్తకార్యోత్పత్తివాదము నిర్యుక్తికమగుటచేఁ బూర్వోక్తరీతిఁ దంతువులయందలినీలత్వపీతత్వాదిగుణముల ననుసరించి పటమునకు నీలత్వపీతత్వాదు లేర్పడిన ట్లాయాజీవులయొక్క-ప్రాక్తనసుకృతాసుకృతవైజాత్యము ననుసరించియే నేఁడు విద్యాశౌర్యాదివిజాతీయగుణము లబ్బుచున్నవనియుఁ బూర్వపక్షికిఁగూడ నంగీకరింపక తప్పదు. అపుడు ప్రాక్తనసృష్ట్యుపసంహారసమయమున నెవరెవరి కేయేసంస్కారము లుండునో పునస్సృష్టిలో నానాయాగుణకర్మములే హేతువులనియు

పూ. ప్ర. 37) ధాతా యథా పూర్వ మకల్పయత్ తై॥ నా॥

(54) ఈక్షతే ర్నాశబ్దమ్ బ్ర॥ సూ॥ 1-1-5

(55) మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్ భ-గీ॥
(56) నహ్యచేతనం చేతనానధిష్ఠితం కిఞ్చిత్ప్రవర్తితుమపి శక్తమ్.
భ-గీ. శాంకరభాష్యము.

ఇత్యాద్యనేకప్రమాణములఁబట్టి జడము లగుగుణములకుఁ జేతనసాన్నిధ్యముచేఁ బూర్వోక్తనిమిత్తోద్భోధవశమున యథా పూర్వముగ సృష్టి జరుగుచుండునని యుఁగూడ నంగీకరింపవలసి యెయుండును. అట్టిసృష్టిసమయమున నట్టిగుణకర్మవిభాగములో నైనను జీవోపాధ్యభివ్యక్తి లేమి నీశ్వరునకుమాత్రమే కారణత్వము గలదని.

పూ. ప్ర. (39) యతో వా ఇమాని భూతాని జాయన్తే తై. వా.
పూ. ప్ర. (38) జన్మాద్యస్య యతః బ్ర. సూ. 1-1-2

ఇత్యాదిశ్రుతిస్మృతుల ననుసరించి ( ప్రతిపక్షులకుఁగూడ ) యర్థనిర్ణయము గావింపకతప్పదు. ఈవిధముగ విచారించినచోఁ బూర్వోదాహృతశంకరభాష్యార్థములోనె మీ (సంస్కర్తల) గుణ కర్మవిభాగాన్వయకృతపర్యవసానార్థముగూడఁ బర్యవసన్నమయ్యెఁ గదా!

ఇట్లెన్నివిధముల విచారించిచూచినను పైపురుషసూక్తాదివచన ములవలనఁ బరమేశ్వరసృష్టి యమేయమగుటచేఁ దదారంభమున జీవులు (ప్రాణులు) ముఖమునుండి పుట్టినను ముక్కునుండి పుట్టి నను, నేఁటివ్యవహారములో నట్టిగుర్తులు గలవారలే(అనఁగా బ్రహ్మ ముఖాద్యుద్భవులె (బ్రాహ్మణాదులు) యనుటమాత్రము పొసఁగదు. వలననఁ దదనంతరసృష్టిలో

(57) సవర్ణేభ్య స్సవర్ణాసు జాయంతేహి సజాతయః-
యాజ్ఞవల్క్యస్మృతి.

(58) సర్వేషాం జన్మనా జాతి ర్నాన్యథా కర్మకోటిభిః.
పశ్వాదీనాం యథాజాతి ర్జన్మనైవ నచాన్యథా ।
సాపి స్థూలస్య దేహస్య భౌతికస్య నచాత్మనః.
సూతసంహితా, 12-51½

ఇత్యాద్యనేకప్రమాణములవలన సవర్ణులవలననే సవర్ణులు జనింతురనియుఁ గర్మకోటులచేఁగూడ జన్మముచే నేర్పడినజాతి యొకేజన్మమందు మాఱదనియుఁ దెలియుచున్నయది. నేఁటివ్యవహారములోఁగూడ నదేవిధముగ సద్గుణములు గలశూద్రుని సచ్ఛూద్రుఁడనియు, దుర్గుణములు గలబ్రాహ్మణుని బ్రాహ్మణబ్రువుఁడనియు, (బ్రాహ్మణక్రిష్టియను, గమ్మక్రిష్టియను, రెడ్డిక్రిష్టియను లన్నట్లు) వాడుదుమెగాని జన్మసిద్ధజాతిని వదలి వాడుటలేదు; వాడఁజాలము. స్వర్గీయ శ్రీధర్మప్రాణ ద్రవిడ లక్ష్మణశాస్త్రి మహోదయోపఘటితమును, శ్రీ 108 శ్రీమ జ్జగద్గురు సంకేశ్వర శాంకరపీఠాధీశ్వరాధ్యక్షతావిరాజమానమును, ఆసేతుశీతాచలవాసి ద్వైతాద్వైత విశిష్టాద్వైతాదిమహాపీఠాధీశ్వరశోభితమును, నానాదేశసుప్రసిద్ధాయుత ( 10,000 ) సంఖ్యాక మహాపండితమండితమునై, కాశీ, దర్భాంగమహారాజాధిరాజాది మహాజనమాన్యముతో 1928 సంవత్సరమున శ్రీకాశీక్షేత్రమున దిగ్విజయముగ జరుపఁబడిన యఖిలభారతవర్షీయబ్రాహ్మణమహాసమ్మేలననామక మగుమహాసభలోఁగూడ

(59) 10 ప్రశ్న=“భాగవతధర్మదీక్షా జాత్యుత్కర్ష ప్రాపికా? నవా?”

అ. భా. బ్రా. మహాసమ్మేలనవిశిష్టాఙ్కము.

(60) 10 ఉత్తరము=మంత్రగ్రహణాదిరూప భాగవతధర్మదీక్షా ఏకస్మిన్ జన్మని ఉత్కృష్టజాతిప్రాపికా నభవతి.

---

ఒకేజన్మమం దెట్టిధర్మదీక్ష నవలంబించిన నుత్కృష్టజాతి రాదని సిద్ధాంతీకరింపఁబడిగూడ నున్నది. ఈసిద్ధాంతమప్రతిహతము.

విశ్వామిత్రాదుల కొకజన్మమునందే క్షత్రియత్వములు మాఱి బ్రాహ్మణత్వములు రాలేదా? యని కొందఱు శంకింతురు. ఇందుకు సమాధానము - ఎట్టిధర్మములు, కర్మములు దీక్షలచేఁగూడ జాతి మాఱదని పైసిద్ధాంతము. తత్తద్వర్ణాశ్రమోచితమహాతపోవిశేషముచే జన్మము మాఱినట్లు విశ్వామిత్రచరిత్రవలనఁ దెలియును. కావునఁ బైసిద్ధాంతమున కిది బాధకము గాదు.

(64) అథ య ఇహ కపూయచరణా అభ్యాశోహయత్తే కపూయాం యోని మాపద్యేరన్। శ్వయోనింవా సూకరయోనింవా చండాలయోనింవా. అథ య ఇహ రమణీయచరణా ... రమణీయాం యోని మాపద్యేరన్. ఇత్యాది

ఛాందోగ్యశ్రు. 5-10-7

(65) సతిమూలే తద్విపాకా జాత్యాయుర్భోగాః.

పా. యో. సూ. 2-13

ఇత్యాదిశ్రుతిస్మృతిశతములచే జన్మాంతరీయసుకృతాసుకృతముల ననుసరించియె లభించునని తెలియఁబడుచుండ, నేఁటివృత్తులచే జాతి వచ్చు (మాఱు) ననుకొనుట గొప్పపొరపాటు. వృత్తుల ననుసరించియే జాతివ్యవహారముల నిర్ణయించవలెననినచో వృత్తులు మాఱినపుడెల్ల నన్యజాతీయుఁడుగ లోకవ్యవహారములు మాఱవలసివచ్చును. అట్లయినచో నవ్యవస్థ యేర్పడును. ఒకవేళ మొదట నెట్టివృత్తినిమిత్తముతో నేజాతీయుఁడుగ వ్యవహరింపఁబడునో యావృత్తి మాఱినను యావజ్జీవముగూడఁ బ్రథమోపాత్తజాతితోడనే వ్యవహారము జరుగుచుండవలెననినచో వృత్తి మాఱినపుడెల్ల జాతి మాఱు ననెడి మీసిద్ధాంతమునకె విరోధము వాటిల్లి ప్రతిజ్ఞాహాని గలుగదా? పోనిండు. ఇదియె మీసిద్ధాంత మనుకొందము. అపుడు విద్యాశౌర్యాదివృత్తినిర్ణయము చేయ వీలుగానిశిశువున కేజాతితో లోకవ్యవహారము జరుగవలెనో-జరుగుచున్నదో బాగుగ నాలోచింపుఁడు? అపుడు జాతియే లేదనుట లోక, శాస్త్ర, వ్యవహారవిరుద్ధము. తలిదండ్రుల జాతినె వాడవలె నందురా? పైన మీరు చెప్పిన ట్లేదో యొక వృత్త్యాదినిమిత్తముచే నొకజాతి వాడఁబడినపిదప నన్యవృత్తినవలంబించినను, బూర్వవ్యవహృత మగుజాతి మాఱనట్లే తలిదండ్రుల జాతి యెపుడు వ్యవహృతమగునో తదనంతరవృత్తులచేఁగూడ నా జాతి మాఱదనియె యథార్థసిద్ధాంత మేర్పడియె. ఏశిశువునకైన నీవిధముగనె జాతి యేర్పడుటలో వృత్తినిమిత్తముకంటె- మాతా

పితృజన్యత్వనిమిత్తమె యుం దేర్పడును గావునఁ దలిదండ్రుల జాతియె ప్రతిమానవునికిని వ్యవహార్య మనకతప్పదు. ఇఁక నాతని తండ్రిజాతి యెట్లేర్పడెనో విచారించినచో-వారిపితరులవలనను, వారికిఁ దత్పితరులవలనను .... ఈవిధముగా

పూ.ప్ర.(48) బ్రాహ్మణా బ్రాహ్మణస్త్రీభి స్సహజాతా స్తపోధనాః

సూతసంహితా 12-8

అని చెప్పఁబడిన సాక్షా త్పరమేశ్వర సంభూతు లగు దంపతులవఱకు వెళ్ళినఁగాని జాత్యభివ్యక్తిస్థాన మేర్పడదు. ఆదంపతులకు బ్రాహ్మణత్వాదిజాతు లేర్పడుటలోఁ బ్రత్యక్షాది ప్రమాణముల కవకాశము లేమిని, పూర్వోదాహృత శ్రుతిస్మృతిభాష్యాదుల ననుసరించి నిష్పక్షపాతముగ విచారించినచోఁ బూర్వభవకృతసుకృతాసుకృతములే హేతువులని తేలుచున్నయది. ఇట్లనాదిలోకవ్యవహారమును, శాస్త్రమును, బాటింపక వృత్తులచేతనే జాతినిర్ణయము గావలెనన్నచో శౌర్యాదులు గలవారలనే క్షత్రియులనియు, వాణిజ్యాదులు గలవారలనే వైశ్యులనియు, వ్యవహరింపవలె ననుటలో మాత్రము వినిగమక మేమియున్నది? వాణిజ్యము గలవారినే క్షత్రియు లనరాదా? ఘట మనివాడఁబడుదానిని బట మనరాదా? కావున ననాది శాస్త్రలోకమర్యాదల, వదలినచో నవ్యవస్థయె కలుగును. ఇంతియెగాని వృత్తిచే మధ్యమధ్య జాతులు మాఱుచుండుననుటగాని, వర్ణములనఁగా రంగులనుటగాని, చెల్లదు. "విప్రశ్శుక్లో నృపో రక్తః" ( -(3)-(ప్ర-) ఇత్యాదిస్థలములలో నాయారంగులు గల వారలె బ్రాహ్మణాదు లనుకొనినచో-శ్వేతవర్ణులలో యుద్ధవాణిజ్యాదివృత్తు లున్నచో వారి నేమనవలెను? నీలవర్ణులలో సత్వవృత్తిగలవారి నేమనవలయును? కావున వర్ణములనఁగా రంగులనుట మిక్కిలిపొరపాటు. ఇఁక "విప్రశ్శుక్ల" ఇత్యాదిస్థలములను-

(66) అజా మేకాం లోహితశుక్లకృష్ణామ్, తై॥ ఉపనిషత్-

ఇత్యాదిశ్రుత్యాదులలో సత్వాదులకుఁ జెప్పఁబడినశుక్లాది రూపపరిభాషల ననుసరించి ప్రధానోపసర్జనభావాఖన్నతత్తత్స త్వాదిగుణవిశేషవాచకశుక్లాదిపదములు పారిభాషికము లనిమాత్రమే తెలియవలెను. ఇదియె సిద్ధాంతము. ఇఁక.

పూ. ప్ర. (6) బ్రహ్మవా ఇద మగ్ర ఆసీత్ బృ॥ శ్రు॥

ఇత్యాదిబృహదారణ్యకములో మొదట బ్రాహ్మణులు గలిగి క్రమముగ వారినుండియె క్షత్రియాదు లేర్పడిరని చెప్పఁబడియుండుటచే సృష్ట్యాదియందావిధముగ జాతు లేర్పడిన ట్లొప్పినను నేఁడుకూడ బ్రాహ్మణాదులనుండి క్షత్రియాదిజాతీయులు రావలె ననుట సరిగాదు.

పూ. ప్ర. (57) సవర్ణేభ్య స్సవర్ణాసు జాయంతేహి సజాతయః

యాజ్ఞవల్క్యస్మృతి.

ఇత్యాదిశాస్త్రమర్యాదలను లోకానుభవమును పైచర్చల ననుసరించి జన్మముచేతనే యాయాజాతు లేర్పడెనని తెలియవలెను. అశ్వగర్ధభసంయోగమున,నశ్వతరి (కంచరగాడిద) యేర్పడినదన్నమాత్రమున నశ్వతరీవ్యక్తులన్నియు, నశ్వగర్ధభసంయోగజన్యములగునా ? అట్లుగాదు. తత్తత్సజాతీయములవలననే తత్తత్పరంపర గలుగుచుండును. పై యాజ్ఞవల్క్యాదివచనములను, లోకమర్యాదలనుగూడ వదలి సృష్ట్యాదివిధానముతోడనే నేఁడుగూడ జాతులు గలుగవలెనన్నచో -

పూ. ప్ర. (1) బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ తై॥ ఆ॥

ఇత్యాదిశ్రుత్యాదుల ననుసరించి ప్రతిబ్రాహ్మణాదులును బ్రహ్మముఖా ద్యద్భవులే గావలసివచ్చును. ఇయ్యది పొసఁగదు గదా ? ఈశ్రుతికి విద్యాబలాదులే యర్థములని చేసినవ్యాఖ్య సరిగాదని పూర్వమే నిరాకృతమైనదిగదా ? -

ఇఁక నేపాశ్చాత్యవిద్వద్విదుషీమణులో యట్లర్థముల వ్రాసినను, దద్వాసనావాసితులు నమ్మినను -

(67) "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" తై॥ అరణ్యకము

(68) "ఆచారవా న్హి పురుషో వేద"

ఇత్యాదిశ్రుత్యాదుల ననుసరించియు (81...88) వక్ష్యమాణ ప్రమాణముల ననుసరించియు నవిచ్ఛిన్నగురుపరంపరాగతమును, నష్టచత్వారింశత్సంస్కారశాలి ద్విజాతిపురుషమాత్రధార్యమును, నిరుక్తసర్వసంస్కారవత్పితృనిర్వ్యసంస్కారప్రభృతిచౌలాంత సంస్కారము లున్నను, ననుపనీతబ్రాహ్మణపుత్రునకే యుపఠనీయము నగువేదము మాత్రము, తదయోగ్యు లగువారికి సాంప్రదాయార్థముల నియ్యఁజాలదనియుఁ, దత్తద్యోగ్యకక్ష్యలలో నుత్తీర్ణుఁడగు నొకరాజకీయాధికారికపురుషునివాక్యముమాత్రమే సఫలమగునా ట్లరగుఁగాని నిరుద్యోగివాక్యము వృథావాక్యమే యైనట్లు, ద్విజేతరులును, సాంప్రదాయరహితులు నగువారిచేఁ బఠితము లగువేదములు పొల్లుమాటలేగాని మంత్రములు గావనియు, వారికి వేదమాత తనహృదయము నియ్యదనియు, నట్టివారు స్వానురూపార్థమునుమాత్రమే గ్రహించి తదనురూపఫలములనే పొందుచుందురనియు, నట్టివారలు సర్వశాస్త్రవిదులైనను వారిమాటలు మూర్ఖవచనములభంగి నగ్రాహ్యములేయనియు -

(69) దుష్టస్య వేదప్రతిబోధితార్థో విజ్ఞాయతే నైవ యథావదత్ర
కిం త్వన్యథైవ ప్రతిభాతి తద్వత్ఫలంచ తద్రూపకమేవ తస్య.

(70) తస్మా దసాంప్రదాయవిత్సర్వశాస్త్రవిదపి మూర్ఖ ఇవోపేక్షణీయః.
శాం. గీ. భా.

ఇత్యాదిప్రమాణములవలనఁ దెలియుచుండుటచే వారివ్రాఁతలును, వారియశాస్త్రీయము లగువిశ్వాసములు నకించిత్కరములు.

ఇఁక బ్రాహ్మణులవలననే యితరులు గలిగిరని బృహదారణ్యకముననును, విరాట్పురుషునివలననే చాతుర్వర్ణ్య మేర్పడెనని పురుషసూక్తముననును, బ్రాహ్మణాదిసృష్టిక్రమము పరస్పరవిరుద్ధముగ నుండెఁగదా! ఇం దెయ్యది సిద్ధాంతము?- అనుప్రశ్నమాత్రము గలుగును. ఇందుకు -

(71) తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః, తై. ఉ.

(72) ఇదగ్ం సర్వ మసృజత తై. ఉ.

ఇత్యాదిశ్రుతులలో యుగపత్సృష్టియుఁ గ్రమసృష్టియుఁ గాన్పించుచుండెఁగదా! ఇం దెద్ది వాస్తవమని శంకరాఁగా -

(73) ద్వివిధశ్రుతిసద్భావా ద్ద్వివిధస్వప్నదర్శనాత్

ఇత్యాదిగా శ్రీవిద్యారణ్యులవారు స్వప్నములవలె నీద్వివిధ సృష్టులును బ్రహ్మాండభేదముచే నుండవచ్చునని చెప్పినట్లును, యోగవాసిష్ఠోత్పత్తిప్రకరణములలో

(73 క.) ఆచారా ద్వేదశాస్త్రాణా మాద్య ఏవాన్యథోదితే
ఆరంభోఽపి తథాస్యైషా మనిత్య స్సంస్థితః క్రమః.

యోగవాసిష్ఠము. 3-30-24

(73 ఖ.) నను 'ధాతా యథాపూర్వ మకల్పయ' దితిశ్రుత్యా సర్గాణా మైకరూప్యం ప్రతిపాదితమ్ ; తద్విరుద్ధం కథం వైచిత్ర్య ముచ్యతే ? తత్రాహ -

ఆచారాదితి... తథాపిధాత్రంతరసర్గాపేక్షయా అస్య క్రమోఽనిత్యోఽనియత ఏవ సంస్థిత ఇతి వైచిత్ర్యసిద్ధి రిత్యర్థః.

యోగవా. వ్యాఖ్యా తాత్పర్యప్రకాశాఖ్యా.

అని చెప్పఁబడినట్లును, ననేకవిధసృష్టులలో ననేకవిధములుగ నుండవచ్చునని సమాధానము చెప్పవచ్చును. పర్యవసానములో నాయాసృష్ట్యారంభము లెట్లున్నను, బ్రకృతసృష్ట్యారంభ మేశ్రుతి ననుసరించినదైనను, నేఁటివ్యవహారవ్యవస్థావిషయములో నుభయశ్రుతులును, నిరుక్త (57 ప్ర.) యాజ్ఞవల్క్యస్మృతివచనములతో నవిరుద్ధముగ నేకవాక్యత నొందుచుండుటచే నాబృహదారణ్యకవచనములు నిరుక్తసిద్ధాంతమునకు బాధకములు గాఁజాలవు. ఈబృహదారణ్యకశ్రుత్యర్థసమన్వయమంతయుఁ 'దుష్యతు' న్యాయము ననుసరించి యభ్యుపేత్యవాదముగఁ జేయఁబడినయది. వాస్తవము విచారించినచో -

(74) తచ్ఛ్రేయోరూప మసృజత । స విశ మసృజత
స శౌద్రం వర్ణ మసృజత. బృహ - ఉ.

ఇత్యాదిస్థలములలోఁ దచ్ఛబ్దమునకు సృష్టికర్త యగుబ్రహ్మ మెయని

(75) య మగ్నిం సృష్ట్వాఽగ్నిరూపాపన్నమ్ - శాం. భా.

ఇత్యాదిశాంకరభాష్యమువలనఁ దెలియుచున్నది. ఇచట సృష్ట్యారంభమున బ్రహ్మయ యగ్నిభావాపన్నమాటచే బ్రాహ్మణజాత్యభిమానముకలదై తత్తత్కర్మనిర్వహణార్థము క్షత్రియాదుల సృజించెనని యర్థమె గాని యొకేవిధముగ నున్నబ్రాహ్మణులు గుణకర్మభేదముచే క్షత్రియాదులుగ మాఱిరనికాదు. ఇదిగాక -

(76) అథే త్యభ్యమంథత్ । స ముఖాచ్చ యోనే
ర్హస్తాభ్యాం చాగ్ని మసృజత. బృ. శ్రు.

ఇత్యాదిస్థలములలో

(77) సః-ప్రజాపతిః,ముఖం హస్తాభ్యాం మథిత్వా ముఖాచ్చ యోనే ర్హస్తాభ్యాంచ యోనిభ్యా మగ్నిం బ్రాహ్మణజాతే రనుగ్రహకర్తారం అసృజత।తథా బ్రాహ్మణో౽పిముఖా దేవ జజ్ఞే।ప్రజాపతేః తస్మా దేకయోనిత్వాత్ జ్యేష్ఠేనే వానుజః, అనుగృహ్యతేఽగ్నినా బ్రాహ్మణః। తస్మా ద్బ్రాహ్మణో౽గ్నిదైవతో ముఖవీర్య శ్చేతి శ్రుతిప్రసిద్ధమ్. । శాంకరభాష్యము.

ఇత్యాదిభాష్యము ననుసరించి చూచినను, సర్వశ్రుతులయందుఁగూడ (40 ప్ర. పూర్వోక్తవిధముగ) విరాట్పురుషునిముఖాదులవలన బ్రాహ్మణాదులు పుట్టిరనియె సిద్ధాంతము సిద్ధించుచున్నది. ఇఁక -

పూ. ప్ర. (5) న విశేషో౽స్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదం జగత్
మహాభారతము.

ఇత్యాదివచనములగతి యేమియన వినుఁడు - ఈస్థలములలోని చాతుర్వర్ణ్యవర్ణనము కర్మకాండోపయుక్తములగు-

(78) గర్భాష్టమే బ్రాహ్మణ ముపనయీత ...

ఇత్యాదిస్థలములలోఁ జెప్పఁబడిన బ్రాహ్మణత్వాది వ్యావహారికజాతుల నుద్దేశించి కాదు.

అయ్యది శాంతిపర్వములోని మోక్షధర్మప్రకరణము. అచట సర్వవర్ణసాధారణము లగుసత్త్వాదిగుణములు గలవారలే మోక్షాధికారులు గావున నట్టివా రేజాతివారైనను గౌణముగ, బ్రాహ్మణులనియును, శూద్రకకర్మలు, వాణిజ్యాదులు గలవారలు గౌణముగ క్షత్రియులు వైశ్యులునని యు, అనఁగా - జన్మముచే బ్రాహ్మణులై పైగుణము లుండుటచే మోక్షమార్గద్వారమున సన్నికర్ష విప్రకర్షములంబట్టి, బ్రాహ్మణబ్రాహ్మణ, బ్రాహ్మణక్షత్రియ, బ్రాహ్మణవైశ్య - ఇత్యాదులుగఁ బరిగణింపఁబడిరనియు, సన్నిజాతులవారిలో నిట్టి గలరనియు, నిట్లు ప్రజాసామాన్యమును శారిభాషికశుక్లరక్తాదిగుణములనుబట్టి గౌణముగ బ్రాహ్మణాద్యుపపదములచే వాడవలయుననియుమాత్రమె సిద్ధాంతము. ఇదియె పైవచనములకు గతి.

ఇట్టిగౌణబ్రాహ్మణత్వము గలబ్రాహ్మణజాతీయులే నిజముగ బ్రాహ్మణులనియు, నట్టిసత్త్వాదులు లేనిబ్రాహ్మణజాతీయులు మోక్షదూరు లగుటచే బ్రాహ్మణు లనఁదగరనియు,

(79) ఇయం గౌ రగౌః క్షీరాఖ్యం ఫలం నప్రయచ్ఛతీతి,

శాం. గీ. భాష్యము.

ఇత్యాదిలౌకికమర్యాద ననుసరించి శ్రీశంకరులు చెప్పినట్లు చెప్పవలయుననియు, నట్టిసత్త్వాదులు గలశూద్రుఁడు - అనఁగా శూద్రజాతీయుఁడు-శూద్రుఁడనఁదగఁడు. మోక్షధర్మసన్నిహితుఁడగుటచే (గౌణముగ) బ్రాహ్మణుఁ డనఁదగినవాఁడౌయనియు,

(80) న సన్న్యాసీచ యోగీచ - భ. గీ. 6-1

అన్న ట్లర్థవాదమాత్రమేయనియుఁ దెలియవలెను. ఈవిషయము -

(81) శూద్రే చైత ద్భవే ల్లక్ష్యం ద్విజే తచ్చ నవిద్యతే।
న వై శూద్రో భవే చ్ఛూద్రో బ్రాహ్మణో నచ బ్రాహ్మణః॥
మహాభారత శాంతిపర్వము 189 అధ్యా - 8 శ్లో.

ఇత్యాదిస్థలములలో వివరింపఁబడియున్నయది. ఇచట శూద్రజాతిఁ బుట్టైనను మోక్షధర్మానుష్ఠానవశమున బ్రాహ్మణుఁడై యునుటచే బ్రాహ్మణాసాధారణధర్మము లగు వేదాధ్యయనాదుల శూద్రుఁ డనుష్ఠించిన నుత్తముఁడై ముక్తుఁ డగుననుకొనుట మాత్రము తగదు. అట్లయినచో -

(82) తస్మా చ్ఛూద్రో యజ్ఞేఽనవక్లృప్తః - తై. సంహితా. 7-1-1

(83) స్త్రీశూద్రద్విజబన్ధూనాం త్రయీ న శ్రుతిగోచరా -

(84) అథాస్య వేద ముపశృణ్వత స్త్రపుజతుభ్యాం
శ్రోత్రప్రతిపూరణమ్॥ బ్ర. సూత్ర. శాఙ్కరభాష్యోదాహృతస్మృతిః

(85) శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్ । స్మృతేశ్చ ।
బ్ర. సూ. 1-3-38.

ఇత్యాదిశ్రుతిస్మృత్యర్థవాదవాక్యములలోఁ బ్రతిపాదింపఁబడిన వేదాధ్యయనప్రతిషేధమునకు విరోధము వాటిల్లదా? మఱియు, బ్రాహ్మణజాతియువిహితవిజాతీయతపఃకారి యగుశంబూకుఁ డను శూద్రుని వధించినధర్మమూర్తి యగుశ్రీరామచంద్రుఁ డకార్యకారి కావలసిరాఁడా?

(86) శూద్రయోనా వహం జాతో నాతోఽన్య ద్వక్తు ముత్సహే
మహాభారతాంతర్గతవిష్ణుసహస్రనామారంభము.

నేను శూద్రయోనిసంజాతుఁడ నగుటచే సాక్షాచ్ఛ్రుత్యర్థమును జెప్ప నధికారినిగానని ధృతరాష్ట్రునితోఁ జెప్పుకొనినధర్మసూక్ష్మవేత్త యగువిదురుఁడు జ్ఞానవిధురుఁడు గావలసిరాఁడా? ఇంతయేల?

పూ. ప్ర. (81) నవై శూద్రో భవే చ్ఛూద్రః - మహాభారతము.

అనుటలో లోకప్రసిద్ధశూద్రత్వ మొకటి యొకనియందుఁ దన్నట్లైనను, నాతనికి సత్త్వాదిగుణప్రయుక్తశూద్రత్వాభావోపలక్షిత

బ్రాహ్మణత్వ మున్నట్లును, దేలుటలేదా ? కావున నిట్టిమహావిరోధ ముండుటచేతనే -

పూ. ప్ర. (81) శూద్రే చైత ద్భవే ల్లక్ష్యం - అన్నచోట-

(87) ఏతత్ — సత్యాదిసప్తకమ్ — నీలకంఠీయవ్యాఖ్య

అనిసాధకబాధకప్రమాణాభిజ్ఞులును, బూర్వోత్తరసందర్భాభిజ్ఞులు నగునీలకంఠాచార్యులవారు వ్యాఖ్యగావించిరి. ఇట్లు వ్యాఖ్యలేనిచో— శూద్రే=శూద్రునియందు; ఏతత్=పూర్వశ్లోకములలో —

(88) జాతకర్మాదిభి ర్యస్తు సంస్కారై స్సంస్కృత శ్శుచిః।
వేదాధ్యయనసంపన్న షట్సు కర్మ స్వవస్థితః।
శౌచాచారస్థిత స్సమ్య గ్విఘసాశీ గురుప్రియః।
నిత్యవ్రత స్సత్యపర స్సవై బ్రాహ్మణ ఉచ్యతే॥
సత్యం దాన మథాద్రోహ ఆనృశంస్యం త్రపా ఘృణా।
తపశ్చ దృశ్యతే యత్ర స బ్రాహ్మణ ఇతిస్మృతః ॥

మహాభారతశాంతిపర్వము 189 అధ్యాయము.

ఈరీతిగ మొదటఁ జేర్కొనఁబడిన బ్రాహ్మణజాతీయాసాధారణధర్మము లగుజాతకర్మాదులఁగూడ గ్రహింతురేమోయనియు, నట్లుగ్రహించినచోఁ బైశాస్త్రవిరోధము వచ్చునుగావున నట్టియజ్ఞానాదుల వదలి సర్వజాతులలోను బూర్వోక్తపారిభాషికశుక్లాదిగుణము లుండుటచే గౌణముగ బ్రాహ్మణు లనఁదగినవారి కెల్లరకును, సాధారణ మగుసత్యాదిసప్తకమే గ్రహింపఁదగుననియు నన్యథాప్రతిపత్తినివారణకై వ్యాఖ్య నొనర్చియుండిరి. ఈవిధముగ నపై భారతశ్లోకముల కర్థముగాని జాతి తెలియనపుడు సత్యాదులఁబట్టి జాతి నిర్ణయించవలెననుట సరిగాదు— ఛాందోగ్యములో

సత్యమును బలుకుటచే బ్రాహ్మణుఁడని నిర్ణయింపఁబడియుండుట బ్రాహ్మణజాతీయులలో జన్మసిద్ధసత్యవాదిత్వమును సూచించునే గాని సత్యవాదులనెల్ల యజనాద్యధికారు లగుజన్మబ్రాహ్మణులఁ జేయఁజూడరాదు. అట్లొనర్పఁజూచుట శునకగోత్వ, నాపిత

బ్రాహ్మణత్వ సంపాదనప్రయత్నముంబోలి, లోకశాస్త్రవిరుద్ధ మగును. గౌణబ్రాహ్మణత్వమన్ననో సర్వజాతీయులలో నుండ వచ్చును. కాని యయ్యది జాతకర్మాదిసంస్కారసంపాదకము గాఁజాలదు. ఈవిషయమంతయుఁ జర్వితచర్వణమైనయది - ఈ భారతశ్లోకముల కిట్టియేకైకవర్ణాంతర్గతగౌణచాతుర్వర్ణ్యార్థకత్వము గ్రాహ్య మనుటలో

(89) బ్రహ్మక్షత్రియవిట్ఛూద్రాః శ్చాతుర్వర్ణ్యా గుణాత్మకాః ।
విప్రశ్శుక్లో నృపో రక్తః పీతో వైశ్యోఽన్త్యజోఽసితః ।
వినృత్య ధర్మశాస్త్రైహి తేషాం కర్మ సమీరితమ్ ।
ఏకస్మిన్నేవ వర్ణేతు చాతుర్వర్ణ్యం గుణాత్మకమ్ ।

మోక్షధర్మేఽధికారిత్వసిద్ధయే ముని రభ్యధాత్ । ... ...
స్వధర్మనిరతా యేతు తే ద్విజేషు ద్విజాతయః ॥

శ్రీకంఠరకృత సర్వవేదాన్తసిద్ధాన్తసారసంగ్రహము.

ఈశ్లోకములు పైభారతశ్లోకములలో వర్ణింపఁబడినయర్థమే యున్నట్లు విస్పష్టముగఁ జెప్పుచున్నయవిగదా ? కావున సత్త్వాది గుణప్రయుక్తబ్రాహ్మణత్వాదులచే నితఁడు ముందు మోక్షమార్గ సన్నిహితుఁడగుననియు, జాతకర్మాదియోగ్యరమణీయయోనికృత బ్రాహ్మణత్వాదులచే నితఁడు పూర్వమున నుత్తమజాతిసంపాదక సుకృతమునుమాత్రమె చేసెననియు గ్రహించి, జాతిబ్రాహ్మణాదుల య్యాధ్యయనాద్యసాధారణధర్మములను వదలినచోఁ బతనాభి ముఖుఁడగుటచే గౌణముగ నింద్యుఁడనియు, జాతిశూద్రాదులయ్యు సత్త్వాదిగుణసంపన్నులు గౌణముగఁ బూజ్యులనియు సిద్ధాంతమును దెలియనగును. ఇట్లే నేఁటికిని శిష్టాచారముగూడఁ గలదని గ్రహింపనగు-కావున నేఁడు గానుపించుచున్నసత్త్వాదిగుణములు నేఁడె బ్రాహ్మణత్వాదిజాతిసంపాదకము లనుకొనుట పెద్దపొరపాటు. కానఁ జాతుర్వర్ణ్యవ్యవస్థ వృత్తికృతమనియు, మానవ పరివర్తనీయమనియు నెన్నడును దలంచరాదు. ఇఁక వేదశాస్త్ర ముల నంగీకరించినను, జాతుర్వర్ణ్యమే సర్వత్ర నిరూపితముగాని

చండాలాదిపాపయోను లగునస్పృశ్యజాతీయు లున్న బైచటఁ గూడఁ గానరాదనుట చెల్లదు - చూడుఁడు -

పూ. ప్ర. (64) అథ య ఇహ కపూయచరణా అభ్యాశోహ యత్తే కపూయాం యోని మాపద్యేరన్, శ్వయోనింవా సూకరయోనింవా చండాలయోనింవా। ఛాం. 5, 10, 7

ఈశ్రుతి చండాలురు పాపయోనులని చెప్పుచున్నయది.

(90) తస్మాన్న జన మియా న్నాంత మియా।
న్నేత్పాప్మానం మృత్యు మన్వవాయానీతి। బృ. 3-3-10

ఈ శ్రుతి చండాలురఁగాని, తద్వాటికనుగాని సమీపించఁ గూడదని చెప్పుచున్నయది. ఇచట జనశబ్దమున కంత్యజులే యర్థమనియుఁ, దత్స్పర్శము బొత్తుగా నిషిద్ధమనియు, -

(91) తస్మాత్త మంత్యజనం నేయాత్, నగచ్ఛేత్ సంభాషణదర్శనాదిభి ర్నసంసృజేత్।తత్సంసర్గేణ పాప్మనా సంసర్గః కృత స్స్యాత్। పాప్మాశ్రయోహి సః। తజ్జననివాసం చాంతం దిగంతశబ్ద వాచ్యమ్, నేయా జ్జనశూన్యమపి, జనమపి తద్దేశవియుక్త మిత్యభిప్రాయః, నేదితి పరిభయార్థే నిపాతః। ఇత్థం జనసంసర్గే పాప్మానం మృత్యు మన్వవాయానీతి అనుగచ్ఛేయ మిత్యేవం భీతో జన మంతం నేయాదితి పూర్వేణ సంబంధః॥
బృహదారణ్యక శాంకరభాష్యము.

ఏతచ్ఛాంకరభాష్యమువలనను, నేతదర్థకగౌడపాదకారికలవల నను స్పష్టమగుచున్నయది.

(92) జ్ఞాతచరదేశం చండాలవాటికామివ.
నారదపరివ్రాజకోపనిషత్తు 7 వ యుపదేశము.

ఈశ్రుతి సన్న్యాసాశ్రమికిఁ బూర్వాశ్రమదేశము చండాలవాటిక వలెఁ బరిహరణీయమని చెప్పి, పై బృహదారణ్యకవచనార్థమును ధ్రువపఱచుచున్నయది.

(93) యే భస్మధారిణం దృష్ట్వా నరాః కుర్వన్తి తాడనమ్,
తేషాం చండాలతో జన్మ బ్రహ్మా న్నూహ్యాం విపశ్చితా.
బృహజ్జాబాలోపనిషత్తు. 5 బ్రా

ఈశ్రుతి భస్మద్వేషులకుఁ జండాలజన్మము వచ్చునని జన్మచండాలనిరూపక మగుఛాందోగ్యశ్రుతికి నుపష్టంభక మగుచున్నయది.

(94) యదా వా ఇదం నిషాదా వాసే లగా వా పాపకృతో వా
విత్తవంతం పురుష మరణ్యే గృహీత్వా కర్త మన్వస్య విత్త
మాదాయ ద్రవన్తి। ఋగ్వేదీయ ఐతరేయ బ్రాహ్మణము 8-2

ఈశ్రుతి నిషాదాదిపదవాచ్యచండాలాదిపాపయోనులకుఁ జౌర్యాదిదుర్గుణములఁ జూపుచున్నయది -

(95) ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చ ...శ్వభ్యః శ్వపతిభ్యశ్చ వో నమః
కృష్ణయజుర్వేదీయరుద్రాధ్యాయము. 4-5-4-

ఈశ్రుతి రుద్రసర్వాంతర్యామిత్వమును జెప్పుచుఁ జండాలాద్యనేకసంకరజాతులను జూపుచున్నయది -

(96) బ్రహ్మణే బ్రాహ్మణ మాలభతే. ఇత్యారభ్య,
... వాయవే చాండాలమ్-ఇత్యంతమ్
కృ॥యజుర్వేదబ్రాహ్మణము. 3-4-16

ఈశ్రుతిలో (16పనసల, మూడు వాక్యములలో) నాయాయాగములయందుఁబశురూపులుగ గ్రహింపఁదగిన యనేకానులోమప్రతిలోమచండాలాది జాతీయులు చూపఁబడిరి. ఇచట నస్పృశ్యుఁడగుచండాలుఁడు యాగపశువై స్పృశ్యుఁ డెట్లగునని కొందఱు సంశయింతురు. కాని జాతకర్మకాలమునఁ బితరుల కాశౌచములేనట్లు తాత్కాలికమంత్రకృతపవిత్రతను వేదము లంగీకరించినపుడు మన కిచట సందియ మెందులకు ?

(97) వచనా త్ప్రవృత్తి ర్వచనా న్నివృత్తిః సాంప్రదాయికోక్తి.

(98) తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
భ॥ గీ॥ 16—24.

ఇత్యాదిశాస్త్రమునను సరించి ప్రవృత్తినివృత్తులు శాస్త్రీక నిబద్ధములు గావలసినవేగాని, యచట మన (తర్కము) యూహా లకించిత్కరములు. ఈ విషయ ముత్తరపక్ష II ద్వితీయాం శాంతమున విస్తృతముగఁ జెప్పఁబడియె. ఈ విధముగఁ జండాల తద స్పృశ్యతాబోధకశ్రుతు లనేకములు గలవు-ఇఁక స్మృతులన్ననో-

(99) శ్వ, చండాల, పతిత, వాయసేభ్యో భూమా వన్నం నిక్షిపేత్
ఆశ్వలాయనగృహ్యసూత్రము.

ఇచటఁ జండాలబలిని సూత్రకారుఁడు విధించియున్నాఁడు. త న్మంత్రబలిసామర్థ్యమున శ్రాద్ధాదులవలనఁ బితౄదులకువలె వా రల కన్నాదులు ప్రాప్తించునని శాస్త్రరహస్యము.

(100) బ్రాహ్మణ్యాం శూద్రసంసర్గా జ్జాత శ్చండాల ఉచ్యతే
ఔశన స్మృతి.

(101) బ్రాహ్మణ్యాం క్షత్రియా త్సూతో వైశ్యా ద్వైదేహక స్తథా।
శూద్రా జ్జాతస్తు చండాల స్సర్వధర్మబహిష్కృతః ॥ -
యాజ్ఞవల్క్యస్మృతి -

పూ.ప్ర. 10.శూద్రా దాయోగవః క్షత్తా చండాలాః ప్రతిలోమజాః।
వైశ్యాయాం క్షత్రియాయాంచ బ్రాహ్మణ్యాంచ యథాక్రమాత్
దేవలస్మృతి.

(102) స్యా చ్చండాలస్తు జనితో బ్రాహ్మణ్యాం వృషలేన యః -
అమరకోశము.

(103) శూద్రా ద్బ్రాహ్మణభార్యాయాం జాత శ్చండాల ఉచ్యతే
స్కాందపురాణము - వర్ణోత్పత్తిఖండము.

ఇత్యాదిస్మృతు లన్నియు, బ్రాహ్మణీశూద్రసంపర్కముచేఁ జండాలజాతి యేర్పడినట్లు చెప్పుచున్నవిగదా ?

(104) త్రివిధోహి సంకరః; వర్ణసంకర స్సంకీర్ణసంకరో
వర్ణసంకీర్ణసంకర శ్చేతి। పరాశరమాధవీయము.

ఇత్యాదిగా విద్యారణ్యులవా రిట్లు త్రివిధభేదభిన్న లగుననే

కానులోమప్రతిలోమజాతీయుల నిరూపించియున్నారు. ఇట్లే పురాతన మగుమనుస్మృతియందుఁగూడ.

(105) శూద్రా దాయోగవః క్షత్తా చండాల శ్చాధమో నృణామ్।
వైశ్యరాజన్యవిప్రాసు జాయన్తే వర్ణసంకరాః॥ మనుస్మృ. 10-12

ఈ శ్లోకము మొదలుగ ననేకానులోమప్రతిలోమసంకరజాతులు సర్వశ్రుతిస్మృతిసంప్రతిపత్తితో నిరూపింపఁబడియుండె. వీరిలోఁ జండాలురు - చర్మకారులు, పుల్కసులు, శ్వపచులు, శ్వపాకులు, సోపాకులు, పాండుసోపాకులు, మున్నగునవాంతర శ్రేణీయులుగా నిరూపింపఁబడిరి. వీరు మాల, మాదిగ, డక్కల, - మున్నగు దేశీయపదములతో వాడఁబడుచుండిరి. ఇట్లే స్కాందపురాణాంతర్గత సూతసంహితాగ్రంథమున 12 అధ్యాయములో శుద్ధవర్ణనిరూపణ మును విస్పష్టముగఁజేసి -

(106) అపరా సూత్తమా జ్జాత స్త్వనులోమః ప్రకీర్తితః।
ఉత్తమా స్త్వపరా జ్జాతః ప్రతిలోమ ఇతి స్మృతః।
వర్ణస్త్రీ ష్వనులోమేన జాత స్స్యా దాన్తరాళికః।
వర్ణాసు ప్రతిలోమేన జాతో వ్రాత్య ఇతిస్మృతః।
కారాచారుసమాఖ్యాయాం నిషాదేన మునీశ్వరాః
చర్మజీవీ సముత్పన్న స్సర్వవిజ్ఞానసాగరాః॥
స్కాందపురాణాంతర్గత సూతసంహితా. 12 అధ్యా.

ఇత్యాదిగాఁ ప్రతిలోమానులోమాంతరాళికవ్రాత్యరూపచతుర్విధభేదభిన్నానేకజాతులు నిరూపింపఁబడియున్నవి, - మఱియు,

పూ. ప్ర. (103) శూద్రా ద్బ్రాహ్మణభార్యాయాం జాత శ్చండాల ఉచ్యతే॥ స్కాందవర్ణోత్పత్తిఖండము

ఇత్యాదిగా ననేకసంకరజాతులు నిరూపింపఁబడినవి. ఇట్లు గ్రంథాంతరములలోనేగాక మనుస్మృతిలోనే యనేకజాతులు నిరూపింపఁబడియుండ 8. ప్ర. "నాస్తితు పంచమ" యను వచనమును లంకించుకొని పూర్వాపరపరిజ్ఞానము లేక చండాలాదిజాతినిరూపక

సర్వస్మృతివచనములఁ బ్రక్షిప్తములనుటయు, శ్రుతులలో నీజాతులె లేవనుటయు, దివాంధదృష్టిని సూచించునేగాని వేఱుగాదు. "నాస్తితు పంచమ" యనుచోట

(107) పంచమః పున ర్వర్ణో నాస్తి। సంకీర్ణజాతీనాంతు
అశ్వతరవ న్మాతాపితృజాతివ్యతిరిక్తజాత్యంతరత్వాన్

మనుస్మృతి 5-4 వ్యాఖ్యామన్వర్థముక్తావళి

అశ్వగర్దభసంసర్గమువలనఁ దదుభయాన్యతరవ్యతిరిక్తజాతీయమగునశ్వతరి (కంచరగాడిద) జనించినట్లు చండాలాదిజాతు లనేకములు జన్మించినను శుద్ధవర్ణములుమాత్రము నాలుగేయని పైమనువచనమున కర్థమని కుల్లూకభట్టు చెప్పుచున్నాఁడు.

(108) చండాలశ్వపచానాంతు బహిర్గ్రామప్రతిశ్రయః।
అపపాత్రాశ్చ కర్తవ్యా ధన మేషాం శ్వగర్దభమ్।
వాసాంసి మృతచేలాని భిన్నభాండేషు భోజనం।
వధ్యాంశ్చ హన్యు స్సతతం యథాశాస్త్రం నృపాజ్ఞయా।
వధ్యవాసాంసి గృహ్ణీయు శ్శయ్యా శ్చాభరణానిచ॥

మనుస్మృతి 10 అధ్యాయము.

ఇత్యాదిశాస్త్రములా చండాలాదులకు బహిర్గ్రామనివాసము, మృతవస్త్రగ్రహణము, వధ్యపురుషధనగ్రహణము, కాటియందధికారము మున్నగువృత్తు లున్నట్లు చెప్పుచున్నయవి -

పూ॰ ప్ర (11) చండాలదర్శనే సద్య ఆదిత్య మవలోకయేత్।
చండాలస్పర్శనే సద్య స్సచేలస్నాన మాచరేత్॥

పరాశరస్మృతి. 6—24

(109) యుగం యుగద్వయంచైవ త్రియుగంచ చతుర్యుగం।
చండాలసూతికోదక్యాపతితానా మధఃక్రమాత్।
తత స్సన్నిధిమాత్రేణ సచేలస్నాన మాచరేత్॥

పరాశరస్మృతి 12—58

౦) దివాకీర్తి ముదక్యాంచ పతితం సూతికాం తథా।
శవం తత్స్పృష్టినంచైవ స్పృష్ట్వా స్నానం సమాచరేత్॥

మనుస్మృతి ౫—౮౫

. ప్రా. (14) ఛాయా మంత్యశ్వపాకాదే స్పృష్ట్వా స్నానం సమా
చరేత్। చత్వారింశత్పదా దూర్ధ్వం ఛాయాదోషో నవిద్యతే॥

స్మృతిరత్నాకరము

1) ఉదక్యాశుచిభి స్స్నాయా త్సంస్పృష్ట స్త్రై రుపస్పృశేత్

యాజ్ఞవల్క్యస్మృతి

2) పూ. ప్ర. (13) చండాలదర్శనే జ్యోతిషాం దర్శనం, భాషణే
బ్రాహ్మణభాషణాదికం, ఉచ్ఛిష్టస్య చండాలస్య దర్శనే ఏక
రాత్రి ముపవాసః సంభాషణే ద్విరాత్రం స్పర్శనే సహాగమ
నేచ సచేలస్నానమ్.

బోధాయనస్మృతి

ప్ర. (12) చండాలదర్శనే సూర్యదర్శనం. సంభాషణే బ్రాహ్మణాభి
వ్యాహార స్సంస్పర్శే సచేలస్నానమితి.

సుమంతువు

ఇత్యాదిస్మృతులు చండాలదర్శన, స్పర్శన, తత్స్పృష్టస్పర్శన, భాషణ, సహాగమనాదుల నిషేధించుచు నైకకంఠ్యముగఁ బ్రాయశ్చిత్తముల విధించుచున్నయవి. ఇఁకఁ గేవలపురాణవచనములఁ జేసికొనినచో నర్బుదన్యర్బుదములుగ బయలుదేఱి యిది యొక మహాపురాణమంతగ్రంథ మగుననుభీతిచే నావిచారమునుండి విరమించితిని.

చండాలేన యథాస్పృష్టం ద్విజవర్ణః కథంచన।
అనభ్యుక్ష్య పిబే త్తోయం ప్రాయశ్చిత్తం కథం భవేత్
బ్రాహ్మణస్య త్రిరాత్రంతు పంచగవ్యేన శుద్ధ్యతి।
క్షత్రియస్య ద్విరాత్రంతు పంచగవ్యేన శుద్ధ్యతి॥
అహోరాత్రంతు వైశ్యస్య పంచగవ్యేన శుద్ధ్యతి
ఖ్యాపయిత్వా ద్విజానాంతు శూద్రో దానేన శుద్ధ్యతి॥

ఆపస్తంబస్మృతి

ఇత్యాదివచనములలో నొక బ్రాహ్మణులకేగాక చాతుర్వర్ణ్యము వారికినిగూడఁ దారతమ్యానుసారముగఁ జండాలసంబంధమునఁ బ్రాయశ్చిత్తములు విహితములై యున్నయవి. ఇట్టియంతరమును శూద్రులుగూడ నేఁటికిని బాటించుచునేయున్నారు. మఱియుఁ జండాలురు మనబావులు స్పృశించినను మనము వారి నీరు త్రాగినను, వారు మనగృహములలోనికి వచ్చినను, వారు మనము నొక చెట్టునీడ నాశ్రయించినను, ... ఇత్యాదివిశేషసందర్భములలో నాయాస్మృతులలో ననేకములుగఁ బ్రాయశ్చిత్తములు విధింపఁబడినవి. విస్తరభయముచే వ్రాయలేదు.

(114) చండాల, సూతికోదక్యా, పతిత, శవ, ఖర, శ్వానాదిస్పర్శనే, తత్స్పృష్టస్పర్శనేచ, శూద్రాదిస్పర్శనే, కాక, మర్కట, గృధ్ర, విష్వరాహోష్ట్ర, వృక, గోమాయు, వానర, మూషపాష్ఠి, రక్త, విష్ఠా, మూత్ర, పురీష, శేష్మ, మద్య, రజ్యాస్థియా తోయాదిస్పర్శనే భోజనే; బిడాలపుచ్ఛస్పర్శనేచ, శావే, శవగృహగమనే శవానుగమనాదిషుచ స్నానం కర్తవ్యమ్. ప్ర॥ ధర్మశాస్త్రము

ఇట్లనేకశ్రుతిస్మృతు లైకకంఠ్యముగ సర్వతోముఖముగఁ జండాలాదిస్పర్శనముల నిష్పక్షపాతముగ నిషేధించుచుండ లేవనుట కూపకూర్మన్యాయానుసారిత్వమును వెల్లడించునేగాని వేఱుగాదు. ఈ శ్రుత్యాదులలోనిచండాలాదిపదము లన్నియు

(115) చండాలప్లవమాతంగదివాకీర్తిజనంగమాః।
నిషాదశ్వపచా వన్తేవాసిచాండాలపుల్కసాః॥ అమరకోశము.

ఇత్యాదినిఘంటువుల ననుసరించి సమానార్థకములని తెలియవలెను. ఏతద్వ్యాఖ్యానమగు, గురుబాలప్రబోధికలో నీశబ్దవ్యుత్పత్తులఁ జూచినఁ బైస్మృతులలోఁ జండాలురకుఁ జూపఁబడిన వృత్త్యాదిమర్యాద లన్నియుఁ దెలియఁబడును. ఈగ్రంథకర్తజైనమతస్థుఁడుగాన మనమతములో నేకపక్షపాతియై వ్రాసెననుట

గూడఁ జెల్లదు. ఇచట నిషాదశబ్దము ద్వ్యర్థియగుసంగతిగూడ నెఱుఁగక 'శ్రీరాముఁడు నిషాదుని స్పృశించెఁగదా! ఈ చండాలు రస్పృశ్యు లెట్లయిరి?' యనువాద మజ్ఞానమూలమని విడిచితిని. మఱియు "నజాతిః పూజ్యతే రాజన్" (9-ప్రి) ఇత్యాది మనువచనములో జాతివలన నొకగౌరవము, గుణమువలన నొక గౌరవము నున్నట్లును, నా రెంటిలో గుణగౌరవము ముఖ్యమని తేలునేగాని గుణి యనినంతమాత్రమునఁ జండాలుఁడును బ్రాహ్మణ జాతీయుఁ డగునని చెప్పుట తప్పు. అట్లయినచోఁ బైఁజెప్పఁబడిన జాతినిరూపకవచనములకు విరోధము రాదా? మఱియుఁ బుత్రినకుఁ దండ్రి నామకరణము చేయునప్పటి కేగుణములుఁగూడఁ దెలియవుకదా! అపుడు శర్మ, వర్మ, గుప్త, దాస, నామములలో దేనిని జేయవలె? వానిజీవితములో మధ్యమధ్య వృత్తులు మాఱినపుడెల్ల నామములు, జాతివ్యవహారములు, మాఱవలెఁగదా! అట్లుతటస్థించునా? ఈ విచార మంతయుఁ బూర్వప్రశ్నోత్తరములద్వారమున నిచటఁ జర్విత చర్వణ మగును. కాన -

(116) స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః। భ-గీ 18-45

అని పరమాత్మ చెప్పినట్లు విదురధర్మవ్యాధాదులవలె స్వవృత్తిస్థితుఁడై భక్తిపరుఁ డగుచండాలుఁడుగూడ గౌణముగఁ బూజ్యుఁడేయనిమాత్రమే యీమనువచనమున కర్థముగాని వేఱుగాదు. కాన నీవిధముగఁ జండాలజాతీయులును దదస్పృశ్యతయుఁ గూడ శాస్త్రసిద్ధములే యగును -

IV

మఱియు, "నాస్తితు పంచమ" యనుమనువచనము చండాలాదిజాతులే లేవని చెప్పుననెడిపూర్వపక్ష వాదము, స్పష్టముగఁ జండాలాదిజాతినిరూపక మగునిరుక్త (104. ప్రి.) "శూద్రా దాయోగవః" ఇత్యాది మనువచనాంతరమునకే విరుద్ధమగుటవలన ముమ్మాటికిని దప్పవక తప్పదనియుఁ, జండాలస్పర్శాదుల నిషేధించుపరాశరాదివాక్యములలో నిరుక్తమను వాక్యము లేక వాక్యతఁ

బొందినవనియుఁ, బైనఁ (100 ... 111. ప్ర-లలో) గనుపఱుచఁ బడియెఁ గావున నీవాదము సమాహితప్రాయమే. కాని, యీమను పరాశరాదిమహర్షులు పక్షపాతబుద్ధితో వ్రాసిరనుట మఱింతపొర పాటు - వీరు నిగృహీతేంద్రియు లగుటచే నందుపైమాత్రము సమాధానము చెప్పఁబడుచున్నది.

(117) నిర్వైర స్సర్వభూతేషు - భ-గీ, 11-55.

అనున్యాయానుసారము వర్తించుటచే వారియాశ్రమములలోని జంతువులుసైతము జాతివైరముల మాని మెలఁగుచున్నట్లు విను చుండియు, వారు పక్షపాతు లనుటకంటె నజ్ఞానపక్షపాతము వే ఱుండదు - పై స్మృతివచనములఁ బరికింపలేదా ? రజస్వల యైన తనభార్యను సైతము చండాలసమానఁగాఁ జూడుమని చెప్పిరే ? శత్రుమిత్రభావముగూడ లేక చెప్పఁబడిన జాతాశౌచమృతాశౌచ కాండములలో నెట్టిపక్షపాత మారోపించెదరో! - దేవపూజాదు లలోనేమి, తుద కాచమనాదులలోనేమి తర్జనీస్పర్శమును నిషే ధించిరే ?

(118) క్షుతే నిష్ఠీవనేచైవ దంతోచ్ఛిష్టే తథానృతే।
పతితానాంచ సంభాషే దక్షిణం శ్రవణం స్పృశేత్ ।
పరాశరస్మృతి. 12-19.

అని దక్షిణకర్ణమునకుఁ బవిత్రతను జెప్పిరే! రజస్వలానో్య న్యస్పర్శకుఁ ద్రిరాత్రోపవాసప్రాయశ్చిత్తమును విధించిరే! ఇ త్యాదులు విచారించినచో మహర్షులకు ధర్మపక్షపాతమే గానఁ బడునుగాని వేఱుగ వచింపరాదు. శ్రుతులలోఁ జండాలాదులఁ జేర్కొనలే దనువాదము, (పూ. ప్ర. 64...90...96) ప్రశ్నో త్తరములచేతనే నిరాకృతమయ్యె. మఱియు ధర్మశాస్త్రముల శేక వాక్యత లేదనుకొనుటకు సామాన్యవిశేషాదిశాస్త్రమర్యాదలు తెలియకుండుటే హేతువులు. అపుడే ప్రక్షిప్తత్వాభ్యూహాలు, ధర్మపరివర్తనాకాంక్షలు నుదయించుచుండును. కావున శాస్త్ర సంప్రదాయపద్ధతి విచారింతము చూడుఁడు. "కృతేతు మానవా

ధర్మాః ” (15-ప్రి) ఇత్యాదిశ్లోకమునకుఁ గలియుగములోఁ
బరాశరధర్మవిరుద్ధము లగుస్మృత్యంతరోక్తధర్మము లగ్రాహ్యము
లనియుఁ బరాశరస్మృత్యనుక్తధర్మము లన్యతోగ్రాహ్యము
లనియు, నుభయతోక్తములు నిర్విచారముగఁ గర్తవ్యములనియు
నుండుటచేఁ గలిలోఁ బరాశరస్మృతికిఁ బ్రాధాన్యము. ఇట్లే యు
గాంతరములలో స్మృత్యంతరములకుఁ బ్రాధాన్యము దెలియవలె
నని యర్థమేగాని, కల్యాదులలో మన్వాదిస్మృతు లప్రమాణము
లని కాదు. కల్యాదులకుఁ బూర్వము ద్వాపరాదులవలెఁ గృతాదు
లకుఁ గల్యాదులును బూర్వములె. ఈరీతిగఁ జక్రనేమిక్రమము
లుగనున్న సర్వయుగముల కనాదిగ నాపద్ధర్మములుసైతము,
దృష్టాదృష్టశ్రుతులలో దివ్యదృష్టికి దృష్టములైనవిధముగ నాయా
ధర్మముల సర్వజ్ఞులైనమన్వాదులు స్మృతులలో వ్రాసిరి. ఆస్మృ
తుల కిట్టియుత్సర్గాపవాదన్యాయసిద్ధముగ నున్నసమన్వయైకవాక్య
తలను, నిబంధనకారులు పూర్వమీమాంసాశాస్త్రానుసారము
నిర్ణయించిరి. ఇట్లు మన్వాదులును నిబంధనకారులును ధర్మవ్యవ
స్థాపకులెకాని, నేఁటిసంస్కర్తలవలె ధర్మపరివర్తకులు (ధర్మమును
మార్చువారు - లేక - అధర్మప్రేరకులు) గారు- కావున నే-

(119) 6 ప్రశ్న-ధర్మజ్ఞాః కే ? కీదృశంవా ధర్మపరివర్తనం కర్తు
మర్హంతి ?

6 ఉత్తరము- ధర్మజ్ఞా మన్వాదయః. తేపి స్వాతంత్ర్యేణ
కిమపి ధర్మపరివర్తనం కర్తుం నప్రభవంతి.

అ. భా. బ్రా. మహాసమ్మేలనవిశిష్టాంకము-

ఇట్లఖిలభారతవర్షీయబ్రాహ్మణమహాసమ్మేలనవిశిష్టాంకములో
(6) నాఱవప్రశ్నమును దదుత్తరమునుగూడఁ గలవు. కావున దేశ
కాలానుసారము మనబుద్ధికిఁ దోఁచినట్లెల్ల ధర్మముల మార్చ వీలు
గాదు. దేశకాలవ్యవస్థచేఁ జెప్పఁబడినట్టి శాస్త్రముల మన మా
విధముగా గ్రహింపవలెనని యర్థము.

V

ఒకఁడు కులభ్రష్టుఁ డైనంతమాత్రమున నాజాతి కెల్ల నట్లు భ్రష్టత లేదో - ఒక బ్రాహ్మణస్త్రీ శూద్రసంపర్కముచే భ్రష్ట యైనందున బ్రాహ్మణస్త్రీల కెల్ల నట్లే కలంకము లేదని తెలియ వలెను. మఱియుఁ జండాలజాతి యట్లుత్పన్నమైనదని యేగాని, తజ్జాతీయు లందఱు బ్రాహ్మణీశూద్రులయందుఁ బుట్టిరని యర్థముగాదు. ఆజాతికిఁ గలికాలము ననుసరించి వృద్ధి గలుగ వచ్చును. మఱి బ్రాహ్మణాదిజాతులకు క్షైణ్య ముండ వచ్చును. అది ప్రకృతిధర్మమే. తల్లిదండ్రులజాతికంటె వేఱు జాతి యేర్పడువిషయమంతయుఁ (107 ప్రి) గుల్లూకభట్టువచనముతో నిర్ణీతమైనదియె. కారణగుణములనఁగాఁ బాపసంకల్పజనితులు గావునఁ దామసకృత్యాదరణముంచుట, చర్మ, శ్మశాన, సంబంధము మున్నగువానిచే విదితమే. ఇఁక ననన్యసాధారణము లగుబహిర్గ్రామనివాసము, కాటియధికారము, వాల్గుబారలదూరముగాఁ దోలఁగుట మున్నగు కొన్నివృత్తులును, అబాధిత మగుచండాలశబ్దానువృత్తియు, వీనినిబట్టియే నేఁటి మాల, మాదిగ, ప్రభృతులే శ్రుతిస్మృత్యుక్తచండాలు రని నిర్ణయింపఁబడుచున్నారు. యథోక్తముగ వీ రస్పృశ్యులుగ లేనిచోఁ దన్నివారకప్రభుశాసనాదిప్రయత్నములు మీ కేల? తన్నివారకము లగునేతచ్ఛాస్త్రచర్చాదిప్రయత్నములు మా కేల? కావున షట్కర్మనిరతి లేనిబ్రాహ్మణులఁ గూడ బ్రాహ్మణులే యని యెట్లు చెప్పుచుంటిమో - నిఖిల వస్తువులఁగూడ లోకవ్యవహారముచేఁ దత్తన్నామకములుగా నెట్లు తెలియుచుంటిమో - యట్లే శాస్త్రోక్తధర్మము లన్నియు లేకుండినను, ననన్యసాధారణదృష్టధర్మమాత్రసహకృతానాద్యబాధితప్రతీతిచే నప్రతిహతముగ వీరే వారని నిశ్చయము చేయఁబడుచుండిరి. తెలుఁగున మాలపల్లెయని యుండును, సంస్కృతమునఁ జండాలవాటికయని యుండును. కానఁ జండాల పదము వ్యవహృతము గా దనుకొనరాదు.

## VI

శంకరాచార్యులవారు "చండాలోఽస్తు" (18-ప్రి.) అనుచోట గురుత్వమును జూపిరే - ఆగౌరవ మెచ్చటనున్నదో విచారించితిరా? ప్రత్యగభిన్నాఖండానందని స్తరంగవిజ్ఞానమహాసముద్రమునందు :- దానినే తత్త్వవిత్తనియుఁ, బరబ్రహ్మమనియు, గురువనియు, జీవపరమార్థరూపమనియు, నద్వైతసిద్ధాంతమునఁ జెప్పెదరు. ఇచట దేహాతిరిక్తాత్మసాక్షాద్గమ్యరూప మగుబ్రహ్మవిద్యయని కున్నట్లును, నిరుక్తపరిపూర్ణాకారతత్త్వమే తననిజస్వరూపమైనట్లును, దచ్చండాలునిచేఁ జేయఁబడినయన్యోన్యాధ్యాసరహిత (నిర్గ్రంథిక) దేహాచైతన్యవిషయక మగు "అన్నమయా" దిత్యాది ప్రశ్నమువలననే యాచార్యులవా రాతనినిజస్వరూపము నిట్లు గ్రహించి, గౌరవించిరి - ఇంతియకాని చండాలత్వాక్రాంత శరీరమందు గౌరవ ముంచలేదు. "చండాలోఽస్తు" అని తదుపాధియందు ధిక్కారమునే చూపిరి. వ్యవహారములో నుపాధికృతాస్పృశ్యతను బాటించియె యుండిరి. ఇఁకఁ బరమార్థమునఁ జండాలోపాధిస్పృశ్యత్వాస్పృశ్యత్వప్రసక్తియే లేదు. కావున నీ యుదాహరణము పూర్వపక్షమున కుపకరింపకపోఁగా శంకరునినాఁడుగూడఁ జండాలుర "గచ్ఛ - గచ్ఛ" యనుట లోకసామాన్యాచారమే యని సిద్ధాంతానుకూలముగఁ జూపట్టుచున్నయది. శంకరునినాఁడననేల? యుగాంతరములలోఁ జూడుఁడు. రంతిదేవుని నీళ్ళడిగిన చండాలుఁడేనాఁటివాఁడు? భ్రష్టత్రిశంకురూపచండాలుఁ డెప్పటివాఁడు? హరిశ్చంద్రునిఁ బానిసగాఁ గొన్నచండాలుఁ డేనాఁటివాఁడు? వర్ణము లెప్పటినుండి యుండెనో - వర్ణసాంకర్య మప్పటినుండి యున్నట్లు (III) పై శ్రుతిస్మృతులే ప్రమాణములు గదా? - ఇఁక -

పూ. ప్రి. (19) శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః

భ - గీ, 5-18.

అనుగీతాన్యాయముచొప్పున వర్తింపవలెనందురా? అప్పుడు.

(120) సమలోష్టాశ్మకాంచనః - భ-గీ,6-8

(121) మానావమానయో స్తుల్యః - భ-గీ, 14-25

ఇత్యాదివచనములుగూడఁ గలుపుకొని వర్తింపవలసియుండు నని గుర్తుంచుకొనుఁడు. ఇదిగాక 'సమదర్శిన' యనుచోట దృశిర్ ధాతువు సకర్మకమగుటచే విద్యాశాలిబ్రాహ్మణప్రభృతి శ్వపాకపర్యంతము నుత్తమమధ్యమాధమభావాపన్నము లగు సుపాధులయందు దేనినో సమముగాఁ జూచువారు పండితులని యర్థమువచ్చును. అట్టిదృశికర్మ యేదియనఁ బ్రత్యగభిన్నాఖండ పరిపూర్ణమగుపరబ్రహ్మమేయని భాష్యకారులు ప్రకరణము ననుస రించి నిర్ణయించిరి. కావున నట్టిసమ్యగ్దర్శనము ప్రస్తుత మగుశ్వపా కోపాధ్యస్పృశ్యత యున్నదనుటలోఁగాని లేదనుటలోఁగాని యేమాత్రము నుపయుక్తముగాదు; గావుననే తచ్ఛ్లోకోదాహర ణము పూర్వపక్షి కకించిత్కరము.

## VII

"స తైస్సమయ మన్విచ్ఛే" త్తనెడి (21. శ్రు.) మను వచన, తద్వ్యాఖ్యానములఁబట్టిచూడఁ జండాలాదిసంబంధము ధర్మాచరణకాలములోనేగాని సర్వదా కాదనుట పొరపాటు.

పూ. ప్ర. (30) తస్మాన్న జన మియాత్ - బృ. శ్రు.

ఇత్యాదిసామాన్యశాస్త్రముచేఁ జండాలస్పర్శసామాన్యము నిషిద్ధమగుచుండ -

(122) తీర్థే వివాహే యాత్రాయాం సంగ్రామే దేశవిప్లవే।
నగరగ్రామదాహేచ స్పృష్టాస్పృష్టి ర్నవిద్యతే॥

ఆచారపల్లవము

(123) సంకటే విషమేచైవ దుర్గేచైవ విశేషతః।
హట్టపత్తనమార్గేచ యథాసంభవ మిష్యతే।

తృణకాష్ఠాదిభూతేచ కుడ్యే నాంతరితే తథా।
గోవాలవ్యజనేచైవ స్నానం తత్ర నవిద్యతే॥ సంవర్తస్మృతి.

ఇత్యాదిస్మృతులలోఁ దీర్థ, వివాహ, యాత్రా, యుద్ధ, దేశవిప్లవ, గ్రామదాహాదులయందు స్పర్శదోషము లేదనియు, సంకట, విషమ, దుర్గ, మహాపట్టణమార్గములయందు యథాసంభవముగ నస్పృశ్యత పాటింపవలెననియుఁ, దృణ, కాష్ఠాదులు, భిత్త్యాదివ్యవధాయకములైనచో - స్నాన మనావశ్యకమనియు, నీ విధముగ ధర్మాచరణసంబంధము లేని వ్యవహారకాలములలోఁ గూడ నీవత్స్పర్శదోషముల నపవదించుచుండ నిట్టిసామాన్యవిశేషవిజ్ఞానము లేక ధర్మాచరణకాలములలోఁదప్ప నితరకాలములలో స్పృశింపవచ్చుననుకొనుట భ్రాంతియె. సంకటాదిసమయములలో విశేషాభ్యనుజ్ఞ నిచ్చినంతమాత్రమున నే సామాన్యవిధాయక శాస్త్రము లేకపోయిన, నున్నట్లు సిద్ధించును గదా -

(124) సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్ -

బ్ర. సూ. 3-4-28.

ప్రాణాపాయసమయములో మాత్ర మభక్ష్యాన్నభక్షణ మంగీకరించుటచే నితరయావత్కాలములోఁ దన్నిషేధము సిద్ధించినట్లు సర్వాన్నానుమత్యధికరణములో నిరూపింపఁబడినది.

ఇఁకఁ బైమనువచనతద్వ్యాఖ్యానములన్ననో -

(125) శ్లో॥ విష్ణ్వాలయసమీపస్థా న్విష్ణుసేవార్థ మాగతాన్
అంత్యజా న్పతితాన్వాపి స్పృష్ట్వా నస్నాన మాచరేత్.

పద్మపురాణము.

ఇత్యాది విష్ణ్వాలయ సమీపధర్మాచరణకాలీనచండాలస్పర్శలలోఁగూడఁ దత్ప్రదోషాభావానుజ్ఞాపకశాస్త్రములవలనఁ దదితర ధర్మాచరణకాలములలోఁ గూడఁ దత్ప్రసక్తి గలుగుచుండఁ జండాలాదులు (101. పు). యాజ్ఞవల్క్యాద్యుక్తరీతిని సర్వధర్మబహిష్కృతులు గావున విశేషాభ్యనుజ్ఞారహితతద్భిన్నధర్మాచరణకాలమాత్రములోఁ దత్సంబంధము తద్ధర్మవిఘాతుక మగుటచే

బొత్తిగా వర్జనీయమని చెప్పునేగాని వేఱుగాదు. మఱియు, సూక్ష్మదృష్టితో విచారించినచో -

(126) సత్యం వద ।

(127) సత్యాన్న ప్రమదితవ్యమ్ । తై. ఉపనిషత్తు.

ఈ విధముగ నన్వయవ్యతిరేకముఖముల సత్యమును బలుకుమనియు, నసత్యమును బలుకరాదనియు సామాన్యశాస్త్ర ముండినను, యజ్ఞవిధిప్రకరణములో -

(128) తస్మైత ద్వ్రతం నానృతం వదేత్. కృ. య. సంహితా.

అసత్యమును బలుకరాదని తిరిగి క్రతునియమములలోఁ జెప్పఁబడుటవలనఁ బైసామాన్యవచనము లేకాలమందైన నసత్యముఁ బలికినచోఁ బాపము ఘటించుననిమాత్రమె చెప్పుననియుఁ గ్రత్వనుష్ఠాన సమయములో నసత్యముఁ బలికినచో - నట్టిసామాన్య పాపము ఘటించుటేగాక క్రతుభంగముగూడఁ గలుగుననియు, సిద్ధించుటచే -"నానృతం వదేత్" అను వచనమునకుఁ గ్రత్వర్థ మెట్లు నిర్ణయింపఁబడియున్నదో - అవిధముగనే-

పూ. ప్ర. (90) తస్మాన్న జన మియాత్. బృ. శ్రు.

అనెడిసామాన్యవచనము చండాలస్పర్శసామాన్యమును బాపజనకమని నిషేధించుచున్నను, పైమనువచనము ధర్మానుష్ఠాన సమయములో సర్వధర్మబహిష్కృతు లగుచండాలురస్పర్శసామాన్యము పాపజనకమగుటయేగాక ధర్మవినాశకముగూడ నగును గావున ధర్మాచరణకాలీనచండాలస్పర్శనిషేధబోధక మగు -

పూ. ప్ర (21) న తైస్సమయ మన్విచ్ఛే త్పురుషో ధర్మ మాచరన్
మనుస్మృతి.

అనెడిమనువచనమునకు ధర్మార్థత్వమే చెప్పవలెఁగాని యర్థకామాదివ్యవహారకాలములలోఁ జండాలస్పర్శనిషిద్ధము గాదనుట యందుఁదాత్పర్యమని చెప్పుట తప్పు. ఇట్లు వాక్యార్థసమన్వయము

చేయనిచో - నిరుక్త (121-122 ప్ర) తీర్థవివాహాదిసంకటసమయ ములలోఁ జండాలస్పర్శ నంగీకరించుటచేఁ దత్స్పర్శసామాన్య నిషేధకము లగు -

పూ. ప్రి. (90) తస్మాన్న జన మియాత్. బృ. శ్రు.

ఇత్యాది వచనములతో నిమిత్తము లేకయే సర్వాన్నానుమత్యధికరణన్యాయము వలన సంకటాదిరహితవ్యవహారాది కాలసామాన్యములోఁ జండాలస్పర్శ ప్రతిషిద్ధమనియు,

పూ. ప్రి. (21) న తైస్సమయ మన్విచ్ఛేత్. మనుస్మృతి.

అనెడి మనువచనములోఁ గూడ నిట్లే సర్వాన్నానుమత్యధికరణన్యాయమువలన ధర్మాచరణరహితవ్యవహారాది కాలసామాన్యములోఁ జండాలస్పర్శ యప్రతిషిద్ధమనియు, నర్థము లభించుటచే వచ్చెడి వజ్రలేపాయమాన మగు విరోధమును బూర్వపక్షి యెట్లు నివారింపఁగలఁడు? కావున నట్లు చెప్పరాదు. పైఁజెప్పఁబడినదియే సిద్ధాంతము. అందు కీమనువచనముతో నేమాత్రము విరోధము కలుగదు.

మఱియు దేవలకాదిస్పర్శ సర్వదాగూడ శిష్టులచే నొక విధముగ నిషేధింపఁబడుచునేయున్నయది. అయ్యది విక్రయాన్నభక్షకులగు విద్వాంసులకు గోచరముగాదు. ధర్మసంశయస్థలములలో శాస్త్రానుయాయులగు పెద్దలనడువడులఁజూచి తెలియుమని (35 ప్రి) మీఁది తైత్తిరీయశ్రుతి చెప్పుచున్నదికదా? కావున శాస్త్రానుసారముగ సర్వశ్రేయోభిలాషులచే జరుపఁబడుతత్తత్స్పర్శనిషేధమును ఘోరమనుటకంటె ఘోరకృత్యము వేఱుండదు.

## VIII

మాంసభక్షకులైనందునఁ జండాలు రస్పృశ్యులై రనుకొనుట పొరపాటు. మాంసభక్షకు లగు కృతాదియుగధర్మానుయాయి

బ్రాహ్మణ క్షత్రియాదు లస్పృశ్యులైరా? వాతాపిభక్షకుఁ డగు నగస్త్యుఁ డస్పృశ్యుఁడయ్యెనా? (ఈయగస్త్యునితో వంతు పెట్టుకొని కొందఱు వాదింతురు. వా రగస్త్యకృతసముద్రపానమును గూడఁ బరికింపవలె) ఇంతయేల? శునకస్పర్శచేయువారి కుత్తమ లోకములు లేవని -

(129) స్వర్గే లోకే శ్వవతాం నాస్తి ధిష్ణ్యమ్. మహాభారతము.

ప్రమాణము గలదు. మార్జార మంతకంటె నీచమైన నస్పృశ్యము గాదు;

(130) మార్జారశ్చైవ దర్వీచ మారుతశ్చ సదా శుచిః. హారీతస్మృతి.

మార్జారపుచ్ఛ మస్పృశ్యమని పై 114 ప్ర. లోఁ జూపఁబడి నదిగదా? మార్జారదంతములు మాంసచ్ఛేదకము లగుచుండ నిరపరాధి యగుశ్లోక నస్పృశ్య మనుటగూడఁ బక్షపాతమేగాఁ బోలు? కావున నిట్టినాస్తికపుటూహల వదలి

పూ. ప్ర. (97) వచనా త్ప్రవృత్తి ర్వచనా న్నివృత్తిః. సాంప్రదాయికోక్తి.

అనెడిమీమాంసాన్యాయము ననుసరించి -

పూ. ప్ర. (98) తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ. భ. గీ. 16-24.

ఇత్యాదిగీతావచనానుసారముగ విధిప్రతిషేధశాస్త్రములఁ బరికించి సిద్ధాంతముల గ్రహింపవలెను - మఱియుఁ జండాలుర నిషేధించుచు యవనుల శూద్రతుల్యులుగఁ జూచి కూపోదకముల గ్రహింపనిచ్చుటకుఁ దన్నిషేధశాస్త్రము లేకపోవుటయు,

(131) చండాలభాండసంస్పృష్టం పీత్వా కూపగతం జలమ్।
గోమూత్రయావకాహార స్త్రిరాత్రా చ్ఛుద్ధి మాప్నుయాత్. పరాశరస్మృతి.

ఇత్యాదివచనములచేఁ జండాలసంబంధము నిషేధింపఁబడుటయె కాక -

(132) శూద్రాణా మనిరవసితానామ్ - పాణినీయసూత్రము.

అనిరవసితశూద్రవాచకపదముల కేకశేషము విధింపఁబడు చుండఁగా -

(133) యై ర్భుక్తం పాత్రం సంస్కారేణాపి నశుధ్యతి తే నిరవసితాః

మహాభాష్యము.

ఎవరు భుజించినపాత్ర సంస్కారముచేతఁగూడ శుద్ధముగాదో- వారు నిరవసితులని చండాలాదులనే చెప్పి, యనిరవసితకోటిలో యవనులఁజేర్చి -

(134) శకయవనమ్, - మృతపచండాలాః - మహాభాష్యము.

అనిప్రయోగములఁ జాలఁ జూపుటచే మ్లేచ్ఛుల నొకవిధముగాఁ జేరనిచ్చుచుంటిమి. ఇచట నిరవసితశూద్రులని చండాలురఁ జెప్పుటచేఁ జండాలురు శూద్రజాతీయులేగదా ? యని యొకయవాంతర శంక గల్గును. ఈ శంక -

(135) శూద్రశబ్ద స్త్రైవర్ణికేతరమనుష్యపరః - తత్త్వబోధిని.

ఇట్టిసూత్రవ్యాఖ్యానానభిజ్ఞత్వకృత మగుటచే ననాదరణీయము- చండాలురకిచటఁ బతంజలి చెప్పినయపపాత్రత్వ మున్నట్లు -

పూ. ప. (108) ' అపపాత్రాశ్చ కర్తవ్యాః ' - మనుస్మృతి 10-51

ఈ మనువచనవ్యాఖ్యానసందర్భములో -

(136) పాత్రరహితాః కర్తవ్యాః - యత్ర లోహాదిపాత్రే

తై ర్భుక్తం సంస్కృత్యాపి నవ్యవహర్తవ్యమ్ ।

మన్వర్థముక్తావళి.

ఈ విధముగఁ గుల్లూకభట్టుగూడ నిరూపించె. నేఁటివఱకు మాలమాదిగజాతు లగుచండాలురకిట్టియపపాత్రత శిష్టులచేఁ బా

టింపఁబడుచునేయున్నయది. కాన శాస్త్రానుసారులకు స్వమతస్థులు గదా, విమతస్థులుగదా, యీపక్షశంకలనాదరణీయములు -

IX

మనకు హేయములుగాఁ గాన్పించినవులాదులే యస్పృశ్యములుగాని శుచిత్వముతో నున్న సమానమానవు లెట్లగుదురు ? ఇత్యాదిశంక లధ్యాత్మదృష్టితో నిరాకృతములుగాన -

(137) యేనైవ పితరో యాతా యేన యాతాః పితామహాః
యేన యాయాత్సతాం మార్గం తేన గచ్ఛన్నరిష్యతి ॥

వ్యాసులు.

యనుధర్మవచనమునను సరించి సనాతనవర్ణాశ్రమధర్మానుకూల శిష్టాచారనిబద్ధులకుఁ జండాలాద్యస్పృశ్యత నివారింపరాదు :-

సిద్ధాంతము (౯)

పై పూర్వపక్ష మైహికదృష్టిచే బయలుదేఱుటచే దుర్బలముగను, నుత్తరపక్ష మాధ్యాత్మికదృష్టిప్రధానముగ బయలుదేఱి యనేకశ్రుతి, స్మృత్యాప్తవాక్యయుక్తమగుటచేఁ బ్రబలముగ నుండుటవలనఁ జండాలాద్యస్పృశ్యత పాటింపఁదగినదియే యని సిద్ధాంతము.

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినో భవన్తు ॥

అస్పృశ్యతాధికరణము - సమాప్తము

ఇది ప్రథమభాగము.

——(౧)——

తతో గ్రామోత్సవే హ స్త శతాభ్యంతరితో యది
తద్దేవస్య కలాహానీ రాజ్ఞో మరణమేవచ
తద్గ్రామస్య క్షయః ప్రోక్త స్సస్యానాం నాశనం ధ్రువమ్.

కారణాగమములోని ప్రాయశ్చిత్తకాండము.

ఇత్యాద్యాగమవచనములఁజూపి చండాలదేవాలయప్రవేశము వనికిరా దనుచుంటిరిగదా? ఆగమము లప్రమాణములని శంకరాచార్యులవారు సూత్రభాష్యమున నిరూపించియుండిరే. అట్టి యాగమములిపు డెట్లుఁ బ్రమాణములగును? ఒక్క శ్రుతిగాని స్మృతిగాని చండాల దేవాలయప్రవేశప్రతిషేధకము చూపట్టదు. కాన నేతద్వాదము దుర్బలము. పాటింపఁదగినదియు గాదు.

## IV

ఒకవేళ నాగమికుల కవి ప్రమాణములైనను సమానముగ నిషేధింపఁబడినసురాపాయిప్రభృతిపంచమహాపాతకుల నాలయముల లోనికి రానిచ్చుచున్నపుడు తత్తుల్యు లగుచండాలుర రారా దనుటకు వారికైన నెట్లు హక్కుండును? మఱియు నజ్ఞాతచరపంచమసురాపాయిప్రభృతిసంస్పర్శమువలనఁ గలాహాని గలుగదా? అట్టి దేవతా మూర్తు లెట్లు పూజార్హము లగును ?

## V

ఇదిగాక చండాలు రొకచోట నాలయములోఁ బ్రవేశింపఁగనే తద్గ్రామక్షయ, రాజమరణ, దుర్భిక్షాదులు జరుగుచుండుట లేదుగదా? అపు డీ (139) కారణాగమవచన మెట్లు ప్రమాణ మగును?

## VI

మఱియు గంగాదినదులలో స్నానముఁజేసినపాపులకుఁ బాపపరిహారమగునుగాని వారిపాపమువలన గంగ యపవిత్రము గాదుగదా? అట్లే పాపయోనులని మీరు చెప్పినచండాలు రాలయమునఁ బ్రవేశింపఁగనే వారిపాపము పోవలెఁగాని దేవునికళయే పోవుటెట్లు? అట్టి దేవుఁడు పతితపావనుఁ డెట్లగును? అట్టితఱి వీరిగతి యేమికావలె?

శ్వే. ప్రే. (17) "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వ
భూతాంతరాత్మా. శ్వేతాశ్వతరశ్రుతిః

ఇత్యాది శ్రుతులచే సర్వపరిపూర్ణుఁడుగఁ దెలియఁబడు దేవునకుఁ గళ [illegible]లెఁగుచెప్పు? కావున నీవచనము లప్రమాణములు.

## VII

సత్యదృష్టితోఁ జూడుఁడు.

40) "సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా భ. గీ. 3-10

ఇత్యాదిగీతావచనములవలన సర్వవేదాధికారము, సర్వకర్మాద్యధికారము సర్వమానవులకు నాచండాలాంతము గోచరించుచుండఁగా "శూద్రులకే వేదకర్మాద్యధికారము లేనపుడు చండాలురకుఁ గైముతికన్యాయముగనే లే"దని వాదించి, వారిని సర్వవిధముల బహిష్కరించుటకన్న స్వార్థపరత్వము సోమకాసురత్వము వేఱుగనుండునా? కాన నిట్టియాసురభావము వదలి వేద, యజ్ఞ దేవాలయాధికారముల విశ్వమానవసోదరభావముతో వారికి వదలుట శ్రేయోదాయకము.

## VIII

పోనిండు. ఛాందోగ్యాదులచేఁ జండాలురకుఁ బాపయోనిత్వముఁ జెప్పుదురుగాక.

41) "మాంహి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాం గతిమ్.
భ. గీ. 9-32.

42) న మే ద్వేష్యోఽస్తి నప్రియః. భ. గీ. 9-29

ఈ విధముగ భగవానుఁడు సర్వసమముగఁ దన్నాశ్రయించిన పాపయోనులకెల్లఁ బరమపదము నిచ్చెదనని చెప్పెఁగదా? అందుకుఁ దార్కాణముగఁ బాడరిక్షేత్రమున విఠోబాప్రభృతులు గొందకాళ్యాద్గ్లుమున్నగు పంచమభక్తు లెందఱో కృతార్థులైనట్లు గూడఁ జరిత్రలవలనఁ దెలియవచ్చుచున్నదిగదా!

పూ. ప. (9) "చండాలమపి సద్వృత్తం తం దేవా బ్రాహ్మణం విదుః"
అను మనువచనమునకు సద్వృత్తిస్థుఁడగుచండాలుఁడు బ్రాహ్మణుఁ డన్నంతమాత్రమే యర్థమును మీరస్పృశ్యత్వాధికరణమున నంగీకరించితిరిగదా ? అట్టియోగ్యత గలచండాలురైన నాలయములకు రానిత్తురా ? ఈ క్రిందిప్రమాణవచనములైనఁ జూడుఁడు.

పూ. ప్ర. (125) "విష్ణ్వాలయసమీపస్థాః విష్ణుసేవార్థమాగతాః
అంత్యజా స్పృశితాన్వాపి స్పృష్ట్వా నస్నానమాచరేత్"
పద్మపురాణము.

ఇట్లు యోగ్యులగుచండాలాదులు విష్ణ్వర్చనకై యాలయములకు వచ్చినపుడు బ్రాహ్మణాదులు వారిని స్పృశించినను స్నానము చేయఁగూడదనుటయె గాక.

(143) "విష్ణ్వాలయాంతికస్థానాం తత్సేవార్థముపేయుషామ్
స్పర్శ స్సర్వాపగాస్నానా దతిరిక్తతమో మతః. పద్మపురాణము.

సర్వనదీస్నానముకంటె విష్ణ్వాలయమునకు వచ్చి తత్సేవఁ జేయు పంచమాదుల స్పృశించుటవలన విశేషఫలముగూడ విహితమగుచుండ నిట్టివిధివాక్యముల మఱుఁగుపఱచి చండాలదేవాలయప్రవేశ మకార్య మనుటకంటె నకార్యము, పక్షపాతము వేఱుగ నుండదు.

IX

కావున యోగ్యులగుచండాలురు దేవతారాధనమునకు దేవాలయములలోఁ బ్రవేశింపవచ్చును.

—○0○—

ఇట్లు పూర్వపక్షములు రాఁగా యథాసంఖ్యముగ నుత్తరపక్షము నిరూపింపఁబడుచున్నది.

## —* ఉత్తరపక్షము. *—

I

ఒకమతములోనివారైనంతమాత్రమున సర్వులకుఁ దన్మతసంబంధము లగు సర్వాధికారములు సమానముగ నుండవలె ననుకొనుట పొరపాటు. వైదికమతస్థు లగుశైవులకు వైష్ణవులకు నొకే పుండ్రము తటస్థించునా? బ్రహ్మచారిగృహస్థుల కన్యోన్యధర్మము

దురు. అట్లుగానిచో నుభయులు భ్రష్టులగుదురు. ఇచటి సాన్నిధ్యా
సాన్నిధ్యములు భగవదనుగ్రహాతదభావములలో హేతువులు గావు.
స్వధర్మస్థత్వతదభావత్వములే హేతువు లగును. ఇందుకు నొక
మహారాజు రాజకీయపురుషులలోను, బ్రజలలోను, నారణ్యకతప
స్వులలోను సాన్నిధ్యాసాన్నిధ్యవిచారము లేక తత్తద్వర్తనముల
ననుసరించి గనఁబఱచెడి నిగ్రహానుగ్రహముల దృష్టాంతముగఁ గై
కొనఁదగును. కాన నిట్టి శంక లకించిత్కరములు. ఇట్లే కొందఱు మత
కలహములో స్వయంకృతమాధ్యస్థ్యము వహించి పంచములకుఁ
గొన్ని దేవాలయముల విడిచిన బాగనియు, వారికిఁ బ్రత్యేకాలయ
ముల నేర్పఱచిన మేలనియు నుడివెదరు. కాని యే దేవాలయములను
బంచములకు విడిచెదమో యచట దేవకళ శాస్త్రానుసారము నశిం
చునుగావున నాదేవాలయముల వలనఁ బంచములకును లాభము
లేదు; దేశమునకును శ్రేయము లేదు. ఇట్లే ప్రత్యేకముగఁ గట్టిం
చునాలయములలో శాస్త్రోక్తవిధముగ దేవతాప్రతిష్ఠలు జరిగినచో
నచటఁ బంచమప్రవేశమునఁ బూర్వోక్తదోషమే తటస్థమగును.
లేక లౌకికవిధితో నిర్మితములైనచో, సవర్ణారాధితదేవమందిరశిఖర
దర్శనములో సహస్రాంశఫలముఁగూడ నిట లేమి నీపక్షముఁగూడ
నకించిత్కరమగుటచే సనాతనుల కననుకూలమును, పర్యవసానము
లో నీరెండుపక్షములుగూడ వర్ణసాంకర్యానుకూలము లగుటచే
సంస్కర్తలకునుగూడ నీమాధ్యస్థ్య మననురూప మగుటచే
నరణ్యరోదనాయమానము, త్రిశంకుస్వర్గప్రాయము నగుచున్నది.

ఇఁకఁ బ్రస్తుతము విమతస్థులైనను స్వమతస్థులైనను నిరవసితానిర
వసితభేదమునుబట్టి చండాలురకంటె మ్లేచ్ఛుల కొకవిధముగ సమీ
పించఁదగియున్నవిషయ మస్పృశ్యత్వాధికరణములో నిర్ణీతమైయు
న్నది.

## II

పైఁ గనుబఱచిన కామికాగమము (144)ననుసరించి చూచినచో
హిందువు లందఱికొఱ కాలయము లేర్పడినవనియు నందుఁ జండా
లురు ప్రాకారబాహ్యదేశముననె యుండవలయుననియుఁ దెలుపుచుం

డఁగా నాలయములు చండాలాదులకొఱకే యనుకొనుట తప్పు. అగ్నిహోత్రాదు లున్నందునఁ బంచాయతనాదులుగాని యవి లేనందు నున్నందున దేవాలయాదులుగాని యనావశ్యకములని యెన్నడు నుండదు. స్కాందపురాణాంతర్గత గేహాఖండ, సూతసంహితాదులం జూచిన బ్రాహ్మణాదుల కాయా దేవయాత్రలెంత యావశ్యకములో తెలియును.

III

ఇఁక శంకరునిచే ఖండితము లగునాగమములు తెల్లుప్రమాణము లనఁగా జీవబ్రహ్మైకత్వజగన్మిథ్యాత్వాంశములకు వ్యతిరిక్తాంశములనె వారు ఖండించిరిగాని సర్వాత్మనా యప్రమాణము లన లేదు.

46) "అప్రతిషిద్ధ మనుమత" మనున్యాయమున ననుసరించి యద్వైతులకుఁ గూడఁ గపిలకణాదాదిమతములవలె నాగమములుగూడఁ బ్రమాణములె గావున సర్వసంప్రతిపన్నపంచమదేవాలయప్రవేశప్రతిషేధవిషయములో నాగమములు ప్రమాణములే. ప్రతివిషయమునకును శ్రుతిని జూపుఁడనుట తగదు.

47) తగ్ంహ త్రీన్గిరిరూపా నవిజ్ఞాతానివ దర్శయాంచకార
......అనంతా వై వేదాః   కృ. యజుర్వేద. బ్రా.

ఇత్యాది శ్రుతులవలన శ్రుతు లనంతములని తెలియుచున్నది. అందుఁ బ్రస్తుతబ్రహ్మాండమున 1180 వేదశాఖలుమాత్ర ముపలబ్ధములైనట్లు

48) ఋగ్వేదాదివిభాగేన వేదా శ్చత్వార ఈరితాః
తేషాం శాఖా హ్యనేకా స్స్యు స్తాసూపనిషద స్తథా
ఋగ్వేదస్యతు శాఖా స్స్యు రేకవింశతి (21) సంఖ్యయా
నవాధికశతం (109) శాఖా యజుషో మారుతాత్మజ!
సహస్రసంఖ్యయా (1000) జాతా శ్శాఖా స్సామ్నః పరంతప!
ఆథర్వణస్య శాఖా స్స్యుః పంచాశ (50) ద్భేదతో హరే!"

యజుర్వేదీయముక్తికోపనిషత్తు.

ఇత్యాదిరీతులను మనుష్యమందిరప్రవేశమునకే యింతటి ప్రాయశ్చిత్తములు గానుపించుచుండ నిఁక దేవమందిరవిషయముఁ జెప్ప నేల ..

ఇట్టి కైముతికన్యాయమే గాక -

152) "కృతపంచమహాపాతకై శ్చండాలాద్యై శ్చాలయే ప్రవిష్టే తత్స్పృష్టని వేదనేచ సప్తాహం మహాశాంతిం హుత్వా దేవం కలశై స్స్నాపయిత్వా పునఃప్రతిష్ఠాం కారయేత్" - మరీచిస్మృతి.

153) "అస్పృశ్యస్పర్శే దేవార్చాయాః పునఃప్రతిష్ఠాపనమ్"

బోధాయనసూత్రము.

ఇత్యాదిగ ననేకస్మృతులు పై (138) యాగమసమానార్థకము లుండ నిట్టిస్మృతులే లేవనుకొనుట కూపకూర్మత్వమూలకమే గాని వేఱుగాదు—

ఇందులో ద్వైతాద్వైతశైవవైష్ణవాదిపరస్పరభేదము లుండు ననియుఁ బద్ద్వారమునఁ జేరి చండాలదేవాలయప్రవేశము నిర్ణయింపవచ్చుననియుఁ దలఁచుట దురాశయె—

154) "పక్షై ర్వర్గోర్ధ్వే సంప్రాప్తే పంచాధికశతం వయః" మన్నట్లు నాస్తికవాదమును ధిక్కరించుటకు వీరందఱు నేకగ్రీవత్వమెయుని గుర్తించుకొనవలయును.

## IV

పంచమహాపాతకులని తెలిసినచో నట్టివారిని బుద్ధిపూర్వకముగ నాలయములలోని కాస్తికులు రానీయరు. సాంఘికదౌర్బల్యముచే నట్లు జరిగినను నేఁడుగాకపోయినను సూర్యచంద్రులుండులోఁగా నేనాఁడు ధార్మికస్వాతంత్ర్యప్రాబల్యము గలుగునో యానాఁడే యీదురాచారములన్నియుఁ గొట్టఁబడునని నమ్మవలెను — మఱియు నజ్ఞాతజాతాశౌచాదులవలనఁ గర్మలోపము లేనట్లు యజ్ఞాతచండాలసురాపాయిప్రభృతిసంసర్గమువలనను దేవకలాపూజాదిలోపము లుండవని తెలియవలెను.

V

ఒకదేవాలయములోఁ జండాలప్రవేశము గలుగఁగనే తత్క్షణమే తద్గ్రామక్షయాదులు జరుగనందున నాశాస్త్రము లప్రమాణములనుట తగదు. ఒకహత్యఁజేసినవానికి విచారణగూడ లేక యారోజుననె యురిశిక్ష జరుగనందున నట్టిప్రభుశాసనమే లేదని మురియుట యెట్టిదో యిదియు నట్టిదే యగును—

(155) "త్రిభి ర్వర్షై స్త్రిభి ర్మాసై స్త్రిభిః పక్షై స్త్రిభి ర్దినైః

అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల మశ్నుతే. వ్యాసులు.

అనెడున్యాయము ననుసరించి కర్మబలానుసారముగ నేఁడో మఱియొకనాఁడో కర్మఫల మనుభవింపకమాత్రము దప్పదు—

(156) నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి – శ్రుతి —

అనేక బ్రహ్మకల్పములు గడచినను గర్మఫలము దప్పదు. అందుఁ గొన్ని సద్యఃఫలకములు మఱికొన్ని కాలాంతర ఫలకములుగ నుండును—

పూ. ప్ర (62) ఇందుకు – "క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్ట జన్మవేదనీయః — పాతంజలయోగసూత్రము

పూ. ప్ర (63) యేన దేహేన కర్మ కృతం తద్దృష్టజన్మ తేనైవ దేహేన భోక్తవ్య ఆద్యః. ... ... ద్వితీయస్తు జన్మాంతర భోగ్య స్స్వర్గనరకాదిహేతుః. పా. భాష్యము – మణిప్రభ.

ఇత్యాదు లనంతములు ప్రమాణములు — కావున నేఁడే చండాలదేవాలయప్రవేశకృతపాపఫలము రాలేదుగావున నాశాస్త్రము లప్రమాణమనుట శాస్త్రప్రామాణ్యవ్యవహారమర్యాదావాసనాభావమూలకము.

VI

ఇఁకఁ జండాలసంపర్కముచే గంగాదినదుల మహిమ దగ్గునా? దేవునిమహిమమాత్ర మెట్లుతగ్గు ననుకొనుట పొరపాటు:— గంగాదినదులమహిమ నైమిత్తికము గాదు. స్వతస్సిద్ధము. దేవతామూర్తులకన్ననో తత్తచ్ఛాస్త్రానుసారియంత్రతంత్రమంత్రోపాస

నాకృత మగుటచే నేసినిమిత్తమువలన శిలాదివిగ్రహముల కట్టి మహిమ వచ్చినదని యేశాస్త్రములఁబట్టి నమ్ముచుంటిమో తద్విరుద్ధము లగుచండాల, రజస్వలా, పశ్వాది సంసర్గమువలన నామహిమ (కల) దొలఁగునని యాశాస్త్రములే చెప్పుచుండ నట్లంగీకరించక తప్పునెట్లు? ఈశాస్త్రములనె నమ్మనిచోఁ దన్మూలకములగునాలయములకు నిక నేమిలాభము? కాన నట్లు గంగానద్యాదులతోఁ బోల్చుట తప్పు.

ప్రతిష్ఠితములుగాక స్వయముగ నభివ్యక్తము లైనదేవతాస్థలములలోఁగూడ నేమహర్షితపోమహిమమో లేక పరమేశ్వర సంకల్పమో యేదేశకాలముల నిమిత్తముచేసికొని యచ్చోట దేవతాకల యావిర్భవించెనో యాయానిమిత్తములఁబట్టి యాకల యుండును—

ఒకానొకచోట నాచండాలజనాధికారము గలదుగదా యందులేమో. అచట నట్టిసంకల్పముతోడనె తదనురూపకల యేర్పడియె గావున నచటఁ జండాలస్పర్శము విరోధించదు.

మఱియుఁ బరిపూర్ణుఁడగుదేవునకుఁ గలాహాని యెట్లనరాదు. సూర్యునివెలుఁగు సర్వత్రయున్నను నొకయద్దమును నిమిత్తముగఁ జేసికొని దర్పణాదిత్యుఁడు విశేషకాంతి నిచ్చును. ఒకభూతాదర్శముమీఁదఁ బడినకిరణములు కేంద్రీకరించి జ్వలించును. ఆ యా దర్పణోపాధులు నశించఁగనె యాయావిశేషకాంతులు, జ్వాలలు, సూర్యున కుండవు. అంతమాత్రమున యథాపూర్వుఁడగు సూర్యుని సర్వవ్యాపకత్వము భగ్నమాయెనా? అట్లే పరమేశ్వరకలావిర్భావ తిరోభావము లౌపాధికములేగాని పరమేశ్వరునికి వృద్ధిక్షయసంపాదకములు గావని తెలియవలెను—

౮. ప్ర (116) స్వే స్వే కర్మ ణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః.
భ. గీ. 18-45

అన్నట్లు వారివారి కనురూపముగ సేవించినచో దేవుఁడు రక్షించునుగానఁ బతితపావనత్వమునకు భంగము లేదు—

లోహములఁ గాచవలెనన్న సాహూదగ్నిసంయోగము తగును. నీటిని గాచవలెనన్న సాహూదగ్నిసంయోగము గలిగినేని యగ్నియే నశించును. నీరు కాగు టెట్లు? కాన నొకపాత్రమంతరముగఁ గైకొని కాచవలెను—

అశ్లో—

(157) ప్రతిలోమాంత్యజాదీనాం స్థూపిం దృష్ట్వా సమాచరేత్
దర్శనం గేహచూడాయా దర్శనం గోపురస్యచ
అంత్యజానాం తథాన్యేషాం విజ్ఞేయం దేవదర్శనమ్...

శైవాగమము.

అంతర్వర్తమానభగవత్ స్థూలదేహస్వరూప మగునాలయ గోపురదర్శనమాత్రముచేఁ జండాలాదులకు దేవదర్శనభాగ్య మబ్బునని శాస్త్రములుండఁగా వారికి గతియేమి? యని యడుగు శాస్త్రమర్యాదాదూరుల కేమిగతియో విచారించవలసియుండు నేగాని వారికి మాత్రము దుర్గతి లేదు- ఇఁక వీరికో?

(158) య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్.

భ. గీ. 16-23.

అని భగవానుఁడు చెప్పిన త్రివిధపరసుఖభ్రంశమే గతి —

చండాలురయందుఁ బక్షపాతమేమైనచో రజస్వల యగు తన భార్య నేలతత్తుల్యగఁ బ్రాకారములోనికి రానీయకుండును? ఇంత విచారింప నేల? బ్రాహ్మణుఁడు తనసహధర్మచారిణి, వితంతువగుతల్లియున్నగువారలుగూడ దేవతామూర్తిని స్పృశింపరాదని చెప్పి -

(159) బ్రాహ్మణ్యపి హారం విష్ణుం నస్పృశే చ్ఛ్రేయ ఇచ్ఛతీ।
సనాథా మృతనాథావా తస్యా నాస్త్యేవ నిష్కృతిః.

నారదస్మృతి.

ఇత్యాదిశాస్త్రములఁబట్టి నడచుచుండఁ జండాలస్పర్శనిషేధక వచనములుమాత్రము సాత్త్వికము లనుటకంటె విపరీతవాద ముండునా?

## VII

భగవద్గీతలలో -

(160) ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా ... ... భ. గీ. 4-28.

ఇత్యాదిగా ననేకవిధయజ్ఞములు ప్రస్తావింపఁబడియెఁగాని తత్తత్స్వరూపములు తత్తదధికారులు నిరూపింపఁబడలేదు — అప్పుడు -

పూ. ప్ర (98) "తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ" - భ. గీ. 16-24.

అనుటనుబట్టి యీసూత్రభూతము లగుగీతావచనముల కన్యత్ర శ్రుతిస్మృతులలో విస్తరార్థము దెలియవలెనని తేలుచున్నది -

పూ. ప్ర (82) తస్మా చ్ఛూద్రో యజ్ఞేఽనవక్లృప్తః. కృ. య. 7-1-1

పూ. ప్ర (85) శ్రవణాధ్యయనార్థప్రతిషేధా త్స్మృతేశ్చ -

బ్ర. సూ. 1-3-38.

ఇత్యాదిశ్రుతిస్మృతులవలన శూద్రులకు వేదాద్యధికారము లేనట్లు స్పష్టమగుచున్నది - కావుననే -

పూ. ప్ర (140) సహయజ్ఞాః ప్రజా స్సృష్ట్వా ... ... భ. గీ. 3-10.

అనుచోట శాంకరభాష్యములోఁ బ్రజాశబ్దమునకుఁ ద్రైవర్ణికు లర్థమని సర్వశాస్త్రసమన్వయదృష్టితో నిర్ధారణచేయఁబడి యుండఁగా నిదియంతయుఁ దెలియమినో, లేక కప్పిపుచ్చవలె ననుదురుద్దేశముననో ప్రజాశబ్దమునకుఁ జండాలాంతప్రజాసామాన్య మర్థమనియుఁ గొందఱికి వేదాధికారమే లేదనుట సోమకాసురత్వమనియు వ్రాయుటకంటె శంబరమైరావణాసురభావము వేఱొండు లేదు —

## VIII

పూ. ప్ర (141) మాంహి పార్థ! వ్యపాశ్రిత్య ... భ. గీ. 9-32

ఈశ్లోకము నుదాహరించి పాపయోను లగుచండాలాదులు దేవాలయప్రవేశరూపసమాశ్రయణముచే ముక్తి నొందవలెనని వాదించుట సరికాదు. అచట స్త్రీశూద్రాదులే పాపయోనులని శాంకరభాష్యాదులలోఁ గలదు. తిలకుగారు పాపయోనులు చం

డాలురని వ్రాసిరి గాని వారిమతానుసారముగనైనఁ జండాలురకు దేవాలయప్రవేశము సమాశ్రయణమని చెప్ప వీలుగాదు. వీని నన్నిటిని వదలి పైవిధముగ స్వతంత్రించి గీతల కర్థము చెప్పఁబూనుట పైనఁ (III పేరాలో) జూపఁబడినశాస్త్రప్రమాణ (147-150) జ్ఞానశూన్యతను వెల్లడించునేగాని వేఱుగాదు -

మఱియుఁ బండరిక్షేత్రాదులలోఁ బంచమాదులును, గొంద ఱాళ్వారులును మహాభక్తిచే ముక్తులైరని చెప్పినందున నేఁటి మీ వాదమున కుపయోగము లేదు - ఆయాపంచమభక్తు లెవరైన స్వజాతివిహితధర్మముల నుల్లంఘించి, దేవాలయములలోఁ జేరి దేవుని బూజించినందున నట్లు ముక్తులై పూజ్యులైరని యెచటనైన వినియుంటిమా ? వారు తత్తజ్జన్మానుకూలవిధివిహితకర్మములచేఁ బరమేశ్వరు నర్చించుటచేతనే -

(161) స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః. భ. గీత.

అన్నట్లు - సిద్ధులైరిగాని వేఱుగాదు - ఇదిగాక యనేకజన్మార్జిత సుకృతపుంజసహకృతమై, పాపయోనిసంపాదక మగు కించిత్కర్మవిశేషముచేఁ గలిగినచండాలశరీరమందుఁగూడ ననన్యభక్తి, లేక యపరోక్షబ్రహ్మసాక్షాత్కృతియు నొకానొకనికిఁ గలుగవచ్చును. అయ్యది విహంగమమార్గము. అట్టి యనన్యభక్తిగాని యపరోక్షబ్రహ్మసాక్షాత్కారముగాని చండాలయోనియందేగాక వామదేవాదులకువలెనే శ్వసూకరాదియోనులయందైన ననేకజన్మార్జిత సుకృతపుంజపరిపాకవశమునఁ గలుగవచ్చును. వారు ముక్తులుగావచ్చును. తత్ప్రతికృతిమూర్తులు పూజ్యములుగావచ్చును. కాని, హనుమానుఁ డబ్ధి నుల్లంఘించినందున నస్మదాదులకు సముద్రతరణసాధనము నౌక గాదనియు, నుల్లంఘనమే యనియు నెట్లు చెప్ప వీలుగాదో యట్లే సార్వజనీనముగఁ జండాలదేవాలయప్రవేశవిచారములో మీయుదాహరణ మకించిత్కరము.

మఱియు,

ఇత్యాదివచనములు దేవదర్శనసమయములలోఁ బంచమస్పర్శను నిషిద్ధము గా దని చెప్పెడివిశేషవిధివాక్యముల (అపవాదశాస్త్రము) కర్థవాదములెగాని చండాలస్పర్శకు గంగాస్నానఫలవిధాయకములుమాత్రము గావు.

ప్ర. (90) తస్మాన్న స్న జన మియాత్ బృ. శ్రు.

ఇత్యాదిశ్రుతి తచ్ఛాంకరభాష్య గౌడపాదకారికా తదర్థకానేకస్మృతిశతములచేఁ జండాలస్పర్శము చతుర్యుగదూరమున నిషిద్ధమగుచుండుటయు.

ప్ర. (122) 'తీర్థే వివాహే యాత్రాయాం సంగ్రామే దేశవిప్లవే
నగరగ్రామదాహే చ స్పృష్టాస్పృష్టి ర్న విద్యతే॥ ఆచారపల్లవము.

సంగ్రామము, గ్రామదాహము, వివాహాదిసంకులసమయములందు స్పర్శదోషము లేదని విశేషశాస్త్ర ముండుటయు, నట్టివిశేషశాస్త్రములలో,

ప్ర. (125) "విష్ణ్వాలయసమీపస్థా" నని పంచమస్పర్శము ప్రత్యేకముగ నిషిద్ధము గాదని చెప్పుటయుఁజూడ నుత్సర్గాపవాదన్యాయము సర్వవిదిత మగుచుండ నట్టివిశేషవిధిలక్షిత చండాలస్పర్శస్తావకమగు " విష్ణ్వాలయాంతికస్థానా " మనువచనమును జండాలస్పర్శమును గంగాస్నానఫలవిధాయకముగ సమర్థింపఁబోవుట సామాన్యవిశేషశాస్త్రమర్యాదాజ్ఞానాభావసూచకము.

దీని కింత విచారమేల! ఒకవిశేషసంకటమున లేక సమ్మర్దసమయమున నొకపని గూడునని శాస్త్ర మెపుడు చెప్పునో తదతిరిక్త కాలములలో నాపని గూడదనియే తేలుసుగదా!

ప్ర. (124) 'సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్
బ్ర. సూ. (3-4-28)
(162) నహ వా ఏవంవిది కించనానన్నం భవతి' ఛాం. 5-2-1

ఇట్లు సర్వాన్నానుమత్యధికరణమునఁ బ్రాణాపాయసమయములో నభక్ష్యాన్నానుజ్ఞ యుండుటచే నితరకాలములలో సర్వాన్నభక్షణముగూడదని నిర్ణయింపఁబడలేదా? ఈవాదమంతయు నస్పృశ్యత్వాధికరణమున VII విషయభాగములో సవిమర్శముగఁ

జర్చింపఁబడియేయున్నయది. కావున నీవాక్యములవలన నెన్నటికిఁ గూడఁ జండాలదేవాలయప్రవేశాభ్యనుజ్ఞ సిద్ధింపదు.

IX

యోగ్యులగుచండాలురు నేఁటికిని, -

పూ. ప్ర. (137) "యేనైవ పితరో యాతా యేన యాతాః పితామహాః
యేన యాయాత్సతాం మార్గం తేన గచ్ఛన్నరిష్యతి."

అను న్యాయము ననుసరించి తత్పూర్వులెల్లు శాస్త్రవిధి ననుసరించి, యాలయప్రాకారములలోనికి వెళ్ళక గ్రామోత్సవాదులలో నుత్సవమూర్తుల, నితరసమయములలో నాలయగోపురముల దర్శించి కృతార్థులైరో, అటులనే భగవదాదేశానుసారులై కృతార్థులగుదురుగాక. నిజముగ నేఁటికిని బంచము లటులనే యుండిరి. కాని యిట్టిదుర్వాదముల ననుసరించి మానసంస్కర్తృసోదరులు పంచముల దేవాలయములలోఁ జేర్పఁబూనుట మాత్రము లోకశాస్త్రమర్యాదావిరుద్ధమై యశాంతి హేతువుగా నున్నది గావున నట్టివాదములును బ్రయత్నములును హేయములు.

—* సిద్ధాంతములు. *—

పై పూర్వపక్ష్యుదాహృతవచనము లన్నియు శాస్త్రీయసమన్వయదృష్టితో విచారించిన నుత్తరపక్షానుకూలములుగ నుండుట చేతను, 'దుష్యతు' న్యాయముచేఁ జండాలదేవాలయప్రవేశము నొప్పినచో దేశమునకుఁ బ్రభువునకుఁగూడ మహారిష్ట మేర్పడుట శాస్త్రసిద్ధ మగుటచేతను నట్టి యశాస్త్రీయములు, నిష్యుక్తికములు, ననుభవవిరుద్ధములు, నపాయకరములు నగు పూర్వపక్షీయవచనము లన్నియు నుత్తరవాదిచేఁ బరాకృతములగుటచేఁ జండాలదేవాలయప్రవేశము చేయఁదగదని సిద్ధాంతము.

చండాలదేవాలయప్రవేశాధికరణము - సమాప్తము.

ఇది ద్వితీయభాగము.

# వాహ (బంధ) విచ్ఛేదాధికరణము

వివాహ (బంధ) విచ్ఛేదము (భర్తను భార్యగాని, భా
భర్తగాని యవనుటాసముగఁ తోఁచినపుడు పరస్పరము
ర్యాభర్తృసంబంధమును వదలుకొనుట యనునది )
- ఇట్లు చేయుట తగునా? తగదా?

## —♦ పూర్వపక్షము ♦—

### I

హా మనునది స్త్రీపురుషులకుఁ గలపరస్పరప్రేమానురాల
కము లగు స్త్రీపురుషానుభావ్యసుఖములకొఱ కేర్పడియు
స్థితిలోఁ బరస్పరానురక్తి లేనప్పుడు వారు దంపతులని
కొనుటకు మాత్రమే గాని పర్యవసానములో నుభయాన్య
గూడ నుండకపోఁగా ననేకవిధదుఃఖభాజను లగుచుం
లోకవిదితమే. కావున నట్టివారు విడాకులు చేసికొనుటయుం
ము చేసికొనుటయుఁ దగును.

### II

హ్మణులలోఁ జాలనిబంధనము లుండుటచే దంపతులలో
కము సాధారణముగఁ గలుగనంతవఱకు కిట్టివివాహబంధ
నావశ్యకమే గాని నేఁ డట్టినియమములు లేమిని బూర్వానర్థ
కాలానుసారముగ నావశ్యకమే యనికూడఁ దెలియవలెను.
లో విశేషనిబంధనములు లేమిని మైత్రి చెడుటయు సం
లఁ గలిగించుకొనుటయుఁగూడఁ జాలకాలమునుండియు
పది. వారి కేమిముప్పు వచ్చినది? కాన బ్రాహ్మణాదులు
చేసి సుఖించవగును.

III

మంత్రసంస్కారపూర్వకముగఁ బాణిగృహీత యగుభార్యను గాని యట్టిభర్తనుగాని త్యజించుటకు ధర్మశాస్త్రము లొప్పునా? యని సంశయింపవలదు.

(163) * " వివాదశీలాం స్వయమర్థచోరిణీం
పరానుకూలాన్యవరాభిభాషిణీం
అగ్రాశినీ చాన్యగృహప్రవేశినీ
భార్యాం త్యజేత్పుత్రదశప్రసూతికామ్ ॥ " అభియుక్తోక్తి.

భర్తతో విరోధించినను, జారిణి, చోరిణియైనను, భర్తృశుశ్రూషావిముఖయైనను పదికాన్పులు గన్న భార్యను గూడఁ బరిత్యజించుమని (కాఁబోలు) శాస్త్రము గలదు. మఱియు—

(164) " జారేణ జనయేద్గర్భం మృతే త్యక్తే గతే పతౌ
తాం త్యజేత పరే రాష్ట్రే పతితాం పాపకారిణీమ్

పరాశరస్మృతి (10-29)

భర్త దేశాంతరస్థుఁడైనను, మృతుఁడైనను, భార్య పరపురుషునివలన గర్భమునొందెనేని దానిని బహిష్కరించుమని శాస్త్రము చెప్పుచున్నది.

(165) " స్త్రీణాం నాస్తి పరిత్యాగో బ్రహ్మహత్యాదిభిర్వినా"

చతుర్వింశతిమతము

బ్రహ్మహత్య చేసినచోఁ దప్ప నితరవిషయములలో స్త్రీపరిత్యాగము గూడదని యుండెఁగదా? వ్యభిచారాదిదోషములలోఁ బరిత్యాగమెట్లుగుదురును? పైశాస్త్రమున కీశాస్త్రము విరోధించదా? యనరాదు. ఈచతుర్వింశతిమతమునందే —

(166) " చతస్ర ఏవ సంత్యాజ్యాః పతనే సత్యపి స్త్రియః
శ్వపాకోపహతా యాతు భర్తృఘ్నీ పితృపుత్రగా "

చతుర్వింశతిమతము

---

* అపభ్రంశము, నష్టప్రచారణికము నగునీశ్లోకము కాశీవిశిష్టాంకగ్రంథమున జో కానొక విద్యార్థిపండితునిచే నుదాహరింపఁబడినట్లున్నది.

శ్వపాకాదిసంబంధ ముండినచోఁ ద్యజింపు రుని విశేషవచన ముం
డుటచేతను—

(167) " చతస్రస్తు పరిత్యాజ్యాశ్శిష్యగా గురుగా చ యా
పతిఘ్నీ తు విశేషేణ జుంగితోపగతా చ యా" వాసిష్ఠస్మృతి.

(168) జుంగితః = జాగుప్సితః విద్యారణ్యులు.

(169) హృతాధికారాం మలినాం పిండమాత్రోపజీవినీమ్
పరిభూతాం మథశ్శయ్యాం వాసయే ద్వ్యభిచారిణీమ్
యాజ్ఞవల్క్యస్మృతి.

(170) " విధివత్పరిగృహ్యాపి త్యజేత్కన్యాం విగర్హితామ్
వ్యాధితాం విప్రదుష్టాం వా ఛద్మనా చోపపాదితామ్"
మనుస్మృతి.

ఈవిధముగ శాస్త్రములలో దుష్టగామిని మలిన భర్త్రననుకూల
మైన స్త్రీ పరిత్యాజ్యయని యుండుటచే నిట్టిపరిస్థితులలో భార్యను
భర్త త్యజింపవచ్చును

IV

భార్య, భర్తను బరిత్యజింపవచ్చునా ? యనువిషయమున-

(171) "నష్టే మృతే ప్రవ్రజితే క్లీబేచ పతితే పతౌ
పంచస్వాపత్సు నారీణాం పతి రన్యో విధీయతే" పరాశరస్మృతి.

భర్త నశించినను, సన్యసించినను, నపుంసకుఁడైనను, పాపవర్త
నుఁడైనను, (అనఁగా నేవిధముగానైన స్త్రీసుఖప్రదాయి కానపు
డన్యపురుషుని స్వీకరింపవచ్చునని "కలౌ పారాశరా స్మృతాః"
యను వ్యాఖ్యానుసారము కలియుగధర్మసర్వస్వబోధకపరాశరస్మృ
తియే చెప్పుచుండ సంశయ మేల ? కాన నానుకూల్యము లేనపుడు
భార్య భర్తను ద్యజింపవచ్చును.

(172) " నాదుష్టాం దూషయే త్కన్యాం నాదుష్టం దూషయే ద్వరమ్
దోషేసతి నదోష స్స్యా దన్యోన్యం త్యజతో ర్ద్వయోః" నారదః.

ఇట్లన్యోన్యబంధవిచ్ఛేదమును జెప్పునారదవచనముచే నీపరి

త్యాగవిధి స్ఫుటమగుచున్నది. ఇయ్యది కర్తవ్యమనుటలో ధర్మమూర్తి యగు శ్రీరామచంద్రమూర్తియే సాక్షి.

V

కావున వివాహబంధవిచ్ఛేదము శాస్త్రీయ మగుటచేతను పాశ్చాత్యలోకములో నట్టియాచారము సుఖసాధనముగఁ జూపట్టు చుండుటచేతను సర్వజనాభిలక్షిత మగుటచేతను నిట్టివివాహబంధ విచ్ఛేద మంగీకరింపఁదగినదియే.

—* ఉత్తరపక్షము *—

I

వివాహ మనునది మైథున సుఖాదులకుమాత్రమే యేర్పడిన దనుకొనుటకుఁ బారలౌకిక వాసనాగంధశూన్యతయే కారణము. వివాహసమయములో-

(173) "దశపూర్వేషాం దశాపరేషాం మద్వంశ్యానాం నరకాదుత్తీర్య శాశ్వతబ్రహ్మలోకనివాససిద్ధ్యర్థం ... ... ధర్మప్రజాసంపత్త్యర్థం స్త్రియ ముద్వహే" వైవాహికసంకల్పము.

ఇట్లు పితౄణనివృత్తికొఱకును ధర్మప్రజాసంపత్తికొఱకును వివాహసంబంధ మేర్పడినదేగాని కేవలైహికమాత్రసుఖమునకై గాదు. అట్లయినచో సీమంతాదు లెందుకు? బాగుగ నాలోచించినచో వివాహసంబంధమాత్రము పుత్రకళత్రాది లౌకికవిషయ సుఖమాత్ర ఫలక మగుదృష్టసంబంధమాత్రమేయని పూర్వవాది యాశయము పొడగట్టుచున్నది. కావునఁ దద్భ్రాంతి నిరాసనమునకై ముందు వివాహసంబంధచ్ఛేదములు వివరింపఁబడుచున్నవి. వినుఁడు - వివాహసంబంధము శారీరకమనియు మానసికమనియు ద్వివిధము. అం దాద్యము దృష్టస్థూలశరీరసంబంధమె - ద్వితీయము ద్వివిధము- ప్రేమనిమిత్తము; మంత్రాది సంస్కారనిమిత్తము. ఈవిధముగఁ ద్రివిధము లగుసంబంధములలో నాద్యములు లౌకికములు. తృతీయ మలౌకికము- వీనిలో నుత్తరోత్తరమునకుఁ బూర్వపూర్వ మంగ మగును. మూడవది యగుమాంత్రికవివాహసంబంధ మాహుతి - హవనాది నిమిత్తభేద

ములచే బ్రాహ్మాది నామములచేఁ జతుర్విధమగును- ఇట్లే ప్రథమ ద్వితీయములుగూడ ఏకానురాగోభయానురాగబలాత్కారాది భేదములచే గాంధర్వాది చతుర్విధము లగును. ఈప్రకారముగఁ బూర్వోక్తవివాహత్రయము నిరుక్తబ్రాహ్మాది విభాజకధర్మభేదముల నొప్పి యష్టవిధమగుచున్నది. ఇందు విడారసుకొనినట్టి వివాహముగూడ నొకటి లేదు. అయ్యది గాంధర్వమని యష్టవిధవివాహములలో నొకటిగాఁ బరిగణింపఁబడినది.

174) "బ్రాహ్మస్తు ప్రథమ స్తేషాం ప్రాజాపత్య స్తథాపరః,
ఆర్షశ్చైవాథ దైవశ్చ గాంధర్వ శ్చాసుర స్తథా,
రాక్షసోఽనంతర స్తస్మాత్ పైశాచ శ్చాష్టమో మతః"

నారదస్మృతి

175) "బ్రాహ్మో దైవ స్తథైవార్షః ప్రాజాపత్య స్తథాసురః
గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచ శ్చాష్టమోఽధమః"

మనుస్మృతి (3–21)

ఇట్టి యష్టవిధవివాహములలో -

176) "షడానుపూర్వ్యా విప్రస్య క్షత్రస్య చతురోఽపరాన్
విట్శూద్రయోస్తు తానేవ విద్యాద్ధర్మ్యా న్నరాక్షసాన్."

మనుస్మృతి (3-23)

బ్రాహ్మాది షడ్విధవివాహములు బ్రాహ్మణునకు, నాసురాది చతుర్విధవివాహములు క్షత్రియునకు, ఆసుర, గాంధర్వ, పైశాచములు, విట్శూద్రులకని యిట్లు సామాన్యముగ విధించి,

77) "చతురో బ్రాహ్మణస్యాద్యాన్ ప్రశస్తాన్ కవయో విదుః
రాక్షసం క్షత్రియస్యైక మాసురం వైశ్యశూద్రయోః"

మనుస్మృతి (3-24)

78) "చత్వారో బ్రాహ్మణస్యాద్యాః ప్రశస్తా గాంధర్వరాక్షసౌ
రాజ్ఞ స్తథాసురో వైశ్యే శూద్రే చాంత్యస్తు గర్హితః"

స్మృత్యంతరే— మాధవాచార్యోదాహృతశ్లోకము.

ఈవిధముగ విశేషశాస్త్రములవలన బ్రాహ్మాదిచతుర్విధవివాహములయందు మాత్రమే బ్రాహ్మణునకు ముఖ్యాధికారమనియు, గాంధర్వరాక్షసములు క్షత్రియులకే యనియు నిర్ణయింపఁబడి యుండుటచే సర్వులకు గాంధర్వమే బాగనుకొనుట సమంజసము గాదు. ఇట్లు శాస్త్రబద్ధమై పారలౌకికదృష్టితో నేర్పడిన ధార్మికమగు పవిత్రవివాహసంబంధమును లౌకికయుక్తులతోఁ దొలఁగింప సాధ్యము గాదు.

(179) " న నిష్క్రయవిసర్గాభ్యాం భర్తుర్భార్యా విముచ్యతే.
మనుస్మృతి (9-46)

భార్యను త్యజించినను దుదకు విక్రయించినను యావజ్జీవము ధార్మికమగుభార్యాభర్తృసంబంధ ముండునే గాని యది విచ్ఛిన్నము గాదని యిత్యాది శాస్త్రములు చెప్పుచున్నవి.

హరిశ్చంద్రుఁడు భార్యను విక్రయించినను జంద్రమతికి భార్యాత్వము తొలఁగకుండుట లోకవిదితమేగదా ? అట్లుగాక యధార్మికముగ వివాహితలైనచో వారుంపుడుకత్తియలె గావున వారు యథాపూర్వముగ నన్యగాములగుట సహజమే గావునను వారివిషయ ముపక్రియము. ఇదియునుంగాక భారతీయులలో గాంధర్వాదిరూపముగ సంవరణముగలిగినను దిరిగి యథాయోగ్యముగ వైదికపౌరాణికాదివిధులచే సంస్కారము దృష్టమగుటచే భారతీయజనతాసామాన్యసంబంధివివాహసామాన్యసంబంధముయొక్క విచ్ఛేదమెన్నటికిని గలుగదు.

## II

బ్రాహ్మణులలో నెక్కుడునియమము లుండుటచే దంపతులలోఁ జాలకాలమువఱకు ననురాగము దొలఁగలేదనుట కల్ల. సజాతీయాంతఃకరణవృత్తులకు ననురాగమునకు సంబంధమేగాని నిబంధనముల వలన నేనాఁటికిఁగూడ ననురాగ ముండదు. ఇది లోకవిదితమే.

మఱియు శూద్రాదులకుఁ గులముకట్టుబాట్లనాద్యాచారాను సారము మనకంటె హెచ్చుగలవు. ఎఱుకు, బుడుబుడుకు, చెంచు మున్నగుజాతులలో సికట్టుబాట్లఁజూచినచో మన యజ్ఞాదినియమ ములకన్న మిన్నగ నుండును. అట్టి కట్టుబాట్లు వారికి లేకుండుటచే వివాహబంధవిచ్ఛేదాన్యవరసంబంధవితంతూద్వాహాదులఁ జేయు చుండిరనుకొనుట పొరపాటు.

(180) "శూద్రాణామేవ ధర్మోऽయం పత్యౌ ప్రేతేऽన్యసంశ్రయః
లోభాన్మూర్ఖై రవిద్వద్భిః క్షత్రియై రపి చర్యతే."

వృద్ధమనుస్మృతి.

ఇత్యాదిశాస్త్రముల ననుసరించియే వారివారి కులాచారములు నేఁటి కవిచ్ఛిన్నముగ నున్నవని తెలియవలెను.

III

ఇఁక ననామకములగు "వివాదశీలీ." ఇత్యాదివచనములఁ గట్టిపెట్టి భార్యను భర్త పరిత్యజించుటకు శాస్త్రప్రమాణములు గలవా? యని యన్వేషింపుఁడు.

"జారేణ జనయేద్గర్భ"మిత్యాదిపరాశరవచన మనువసంహార్య వ్యభిచారము గలిగి పశ్చాత్తాపము లేక సంచరించెడిస్త్రీల నుద్దే శించి చెప్పఁబడినది.

ఇట్టిప్రకరణార్థ మీశ్లోకమున కున్నట్లు

(181) "యథాకథంచి త్పరపురుషేణ సంయుజ్య, తత ఉపరతాయా
అనుతాపం గతాయా రూపితో యథోక్తం ప్రాయశ్చిత్తం
పూర్వత్రాభిహితమ్. అథానుతాపరహితాయా దుస్సంగా
దనుపరతాయా స్త్యాగ మిత ఆహ "జారేణేతి." విద్యారణ్యప్రతీక

యని యీవిద్యారణ్యప్రతీకవలనఁ దెలియుచున్నది.

కృతచండాలసంపర్క యగుస్త్రీ పశ్చాత్తప్తయైన ననేకవిధ ప్రాయశ్చిత్తములఁ బరాశరాదులు విధించిరి. అనుపరతవ్యభిచారిణీ విషయమునఁ బరిత్యాగము విహితమయ్యె. అట్లనౌచిత్యము ఘట

స్ఫోటవిధానముతో సమంత్రముగఁ ద్యజించవలెనని ("వివాదశీలీ" యనెడి మాయనామకశ్లోకము (163) లోఁగూడ 'నన్యవరాభిలాషిణీ' యనుపద ముండుటచేఁ దచ్ఛ్లోకస్థసర్వవిశేషణవిశిష్టయు నిట్లనివార్య పశ్చాత్తాపరహితవ్యభిచారిణి గావునఁ బరిత్యాజ్యయనినను బ్రస్తుతము నకు విరోధములేదు. కాన నీ శ్లోక ముపకరింపదు.)

(182) యది దుష్టా సతీ కుర్యా త్పతిస్స్ఫోటో ఘటస్యవై॥
బ్రహ్మాండపురాణము.

ఈవిధముగఁ బరిత్యాగమేగాని భార్యాభర్తల కన్యోన్యము వ్యాధ్యాదులు వైమనస్యాదులు తటస్థించినపుడెల్లఁ బరిత్యాగము కూడదు. అట్టి స్త్రీ నన్యుఁడు పరిగ్రహింపను గూడదు.

(183) "పరపూర్వా యస్య గేహే భార్యా స్యా త్తత్ర నిత్యశః
ఆశౌచం సర్వకార్యేషు దేహే భవతి నిత్యశః
దానం ప్రతిగ్రహో స్నానం సర్వం తస్య వృథా భవేత్"
బ్రహ్మాండపురాణము.

ఇతరుని భార్యను వివాహమాడినవాఁడు పరపూర్వాపతి. అతని కెడతెగని యాశౌచము. తత్కృతదానప్రతిగ్రహాదు లన్నియు వృథాయగును.

(184) "బహుదారః పుమా న్యస్తు రాగా దేకాం త్యజేత్ స్త్రియమ్
స పాపభాక్ స్త్రీజితశ్చ తస్యాశౌచం సనాతనమ్"
కాళికాపురాణము 2వ అధ్యాయము

సంతానవంతుఁ డగుపురుషుఁ డన్యస్త్రీలోలుఁడై భార్యను ద్యజించినచో వాఁడు స్త్రీజితుఁడు, పాపభాజనుఁడు, యావజ్జీవ మతని కాశౌచము వదలదు.

(185) "క్రోధా ద్యది త్యజే ద్భార్యాం వయస్యాంచ గుణాధికామ్
ఋషిచాంద్రాయణం కృత్వా పునస్సంగ్రహ మాదిశేత్"
మత్స్యతంత్రము

ములన్నియు జ్ఞాతికర్తృకవిధవాస్త్రీపరిత్యాగవిషయకము లగుటచే
బ్రకృతవిచారానపేక్షితము లగుటవలనఁ బరిహరణీయములు.

పూ. ప్ర. (169) ఇఁక "వ్యాభిచారా" మనెడుయాజ్ఞవల్క్య
వచనము ...

(188) విప్రదుష్టాం స్త్రియం భర్తా నిరుంధ్యా దేక వేశ్మని- మనుస్మృతి
అనెడుమనువచనముతో సహైకార్థకమని

(189) "వ్యాభిచారా" మిత్యేతదపి నిరుంధ్యా దిత్యనేన సమాన
విషయమ్" పరాశరమాధవీయము.

ఈవిధముగ విద్యారణ్యులు వచించియుండుటచే ప్రాయశ్చిత్తా
ర్హావ్యభిచారిణిని బ్రత్యేకించి కొంతకాల ముంచవలెననిమాత్రమే
యర్థమువచ్చును.

ఇఁక "విధివత్ప్రతిగృహ్యాపి" యనెడు మనువచనము— సప్తప
దీపర్యంతపాణిగ్రహణకర్మము జరిగినను మహావ్యాధ్యాదికన్యా
దోషములు వ్యక్తములైనపు డాకన్యను వదలవచ్చుననియు సప్తపది
గానిది భార్యాత్వసిద్ధి లేదనియు నిట్టియర్థము నిచ్చునేగాని సప్తపద్య
నంతరము సంపూర్ణదారత్వసిద్ధి గలిగినతరువాతఁ బరిత్యాగము నీ
వాక్యము బోధించదు.

ఈవిషయ మంతయు,

(190) "నకేవలం దోష మనాఖ్యాయ దదతో దండః
అపితు సాపి పరిత్యాజ్యేత్యాహ మనుః" విధివది
త్యాది... ... ఏతత్సప్తపద్యభిక్రమణా దర్వా గ్వేది
తవ్యం తత్రైవ భార్యాత్వ స్యోపపత్తేః"
పరాశరమాధవీయము-కన్యాదోషప్రకరణము

అనునీవిద్యారణ్యప్రతీకవలనఁ దెలియఁదగును.

మఱియు సప్తపది కానిది భార్యాత్వసిద్ధి లేదని

(191) "పాణిగ్రహణికా మన్త్రా నియతం దారలక్షణమ్
తేషాం నిష్ఠా తు విజ్ఞేయా విద్వద్భి స్సప్తమే పదే" మనుస్మృతి

(192) "నోదకేన నవా వాచా కన్యాయాః పతి రిష్యతే
పాణిగ్రహణసంస్కారా త్పతిత్వం సప్తమే పదే" యమస్మృతి

(193) "సప్తపదీవిధేః పూర్వ మూఢానాం తిసృణాం (మనోదత్తా వాచాదత్తాఽగ్నిం పరిగతానాం) సంకటేఽన్యేన వివాహో భవతి॥ సప్తపదీవిధౌ జాతే బలా ద్వివాహితాపి నాన్యత్ర దేయా"

ధర్మసింధుసారము.

ఇత్యాదిశాస్త్రములవలన నైకకంఠ్యముగ నిర్ణీతమగుచున్నది గావునఁ గామక్రోధాది సామాన్య నిమిత్తములతో భార్యను భర్త త్యజించరాదు.

IV

భార్య భర్తను త్యజించెడివిషయములో---

ప్రా. స్మృ. (171) "నష్టే మృతే" యనెడువచన ముదాహరింపఁబడినది. ఇచ్చటను "పతితే పతౌ" అనుచోటఁ బతిశబ్దము వ్యస్తమైనప్పుడు సప్తమ్యేకవచనమునఁ "పత్యౌ" అనియుండునేగాని "పతౌ" అనియుండుట వ్యాకరణవిరుద్ధముగావున నఞ్సమాసమున "అపతౌ" అని పదవిభాగము చేసినచో సాదృశ్యార్థకనఞ్ వలన అపతిః=భర్తగానివాఁడు భర్తృసదృశుఁ డనఁగా సప్తపదీసంస్కారము జరుగనివాఁడని యర్థము వచ్చును. అట్టివాఁడు నశించినను క్లీబుఁడైనను [illegible] పత్నులను బొందిన నన్యభర్తను స్వీకరింపవచ్చునని తెలుసు. పై 190, 191, 192, 193 ప్రమాణములలో

సప్తపదికిఁ బూర్వము భార్యాభర్తృసంబంధ మేర్పడదని యుండు టచే నేతద్వచన మట్టికన్య నన్యున కీయవచ్చునని చెప్పును. ఇట్టి యర్థమును బై 193 ధర్మసింధుసారవచనమేగాక

(194) "పాణిగ్రహణసంస్కారాత్పూర్వం పరిణేతు ర్మరణే నకన్యాత్వం హీయతే" పరాశరమాధవీయము

(195) "అద్భి ర్వాచాచ దత్తాయా మ్రియతే వా వరో యది
నచ మంత్రోపనీతా స్యా త్కుమారీ పితు రేవ సా॥ "
వసిష్ఠస్మృతి.

(196) "వరయిత్వాతు యః కశ్చి త్ప్రవసే త్పురుషో యదా
తదా సమాం స్త్రీ నతీత్య కన్యాన్యం వరయే ద్వరమ్॥"
కాత్యాయనస్మృతి.

(197) "ప్రతిగృహ్యాతు యః కన్యాం వరో దేశాంతరం వ్రజేత్
త్రీ నృతూ న్సమతిక్రమ్య కన్యాన్యం వరయే ద్వరమ్॥"
నారదస్మృతి.

(198) సతు యద్యన్యజాతీయః పతితః క్లీబ ఏవవా
వికర్మస్థ స్సగోత్రోవా దాసో దీర్ఘామయోపివా
ఊఢాపి దేయా సాన్యస్మై సప్రావరణభూషణా॥
కాత్యాయనస్మృతి.

ఇత్యాద్యనేకస్మృతు లైకకంఠ్యముగఁ బై "నష్టే మృతే" యనెడు పరాశరవచనసమానార్థకములై యుండఁగా నావచనము ప్రికృతపూర్వవక్షేపయోగి యనుకొనుట భ్రాంతి.

ఈపరిత్యాగముకూడ

(199) "సోయం పున రుద్వాహో యుగాంతరవిషయః"
పరాశరమాధవీయము-వరదోషపరిశరణము.

యుగాంతరవిషయమని విద్యారణ్యులు వ్రాసి తదుపష్టంభకముగ

(200) "ఊఢాయాః పునరుద్వాహం జ్యేష్ఠాంశం గోవధం తథా
కలౌ పంచ నకుర్వీత భ్రాతృజాయాం కమండలుమ్॥"

ఆదిత్యపురాణము.

అను వచనముగూడ నుదాహరించిరి.

ఇట్లుగాక "నష్టే మృతే" యను శ్లోకమునకుఁ బూర్వపక్షి యభిప్రాయమే సత్యమైనచో

201) "క్లీబం విదూషితం వాపి వ్యాధితం వ్యర్థమేవ వా
సుస్థితం దుస్థితం వాపి పతి మేకం నలంఘయేత్.

భార్గవస్మృతి. కర్మవిపాకము.

202) "దరిద్రం వ్యాధితం క్లీబం భర్తారం యా నమన్యతే
సా మృతా జాయతే వ్యాలీ వైధవ్యంచ పునః పునః"

వృద్ధపరాశరస్మృతి.

ఇత్యాదిశాస్త్రములలోఁ గ్లీబుఁడైనభర్తను, వృద్ధుఁడైనభర్తను రిత్యజింపరాదనియు నట్లు చేసినచో నీచయోనిసంభవమును వైధవ్య రంపరయుఁ బ్రాప్తించుననియుఁ జెప్పునట్టి యనేకశాస్త్రములతో రోధమెట్లు తప్పును? కావున నిట్టి యర్థవర్ణనము లప్రామాణికములు.

మఱియు "నాదుష్టా" మనెడు నారదోక్తిలోఁ బరిత్యాగనిమి ్తముగఁ జూపఁబడినదోషము పైఁ (వ. 194 ... 198) జేర్పఁబడఁ డినరీతిగా సప్తపదికింటెఁ బూర్వము తెలియఁబడినదోషమని చెప్పక ప్పదు. ఈవాక్యమున కింతియె తాత్పర్యమని వైద్యనాథదీక్షితీయమున ్తితమైగూడ నున్నది. కాన నిట్టిత్యాగమువలనఁ బూర్వపక్షియిష్టార్థ ్తి గలుగదుగాన నీవాద మంతయు దుర్బలము.

V

పై విధముగ భార్యాభర్తల పరస్పరవివాహబంధవిచ్ఛేద మశాస్త్రీయమని తేలినది. ఇఁకఁ బాశ్చాత్యశిక్షకిఁ బాశ్చాత్యదృష్టి వదలలేదు. భూలోకగంధర్వనగర మనుప్యారిస్ పట్టణము వీరి దృష్టిపథములో నుండెఁ గాఁబోలు. వారి కనిపెట్టనైనమనువువలన యౌవనముననే వృద్ధత్వము వచ్చుట, దుర్యోనివ్యాధులకు భాజనులై దుఃఖాదర్శము లగుట, యిహపరదూరులగుట యెఱుఁగరు గాఁబోలు. అట్టి విచార మకించిత్కరము. జుగుప్సితము. కావున హేయము.

ఈ వివాహబంధవిచ్ఛేదమునే జనసామాన్య మవలంబించుచున్నదిగా? అహో! లోకమెల్ల స్వేచ్ఛావిహారులు, స్వైరిణులే గాఁబోలు? (203) "కామినా స్వతాం పశ్యతి" యన్నట్లు తా నేరంగు కంటిజోడును ధరించిన జగమెల్ల నట్లే కాన్పించుట సహజమేగదా! అట్లు గానిచో రావణుఁడు మహాపతివ్రతామతల్లి యగుసీత నేల కామించును? ఇట్లెన్నఁడు తలఁపరాదు. ఇది యార్యావర్తము గాని, వైహికసుఖప్రధాన భూమి గాదు. కావునఁ బాశ్చాత్యులు గూడఁ బురోదృష్టి నొందుచుండుట గ్రహించి పూర్వపక్షిగూడఁ గొంతము పురోదృష్టి నూనినచో భారతఖండమహిమ తెలియును. కాన వివాహబంధవిచ్ఛేద మశాస్త్రీయమేగాక వైహికానర్థావహముగూడ నగుటచే ననాదరణీయము.

## —* సిద్ధాంతము. *—

పూర్వపక్షమ్ము పాశ్చాత్యసంగ్రహణవచనము లనన్యార్థకము లగుటచే నవి యుపకరించక పోవుటచేతను, అనుకసంహిత్యపశ్చాత్తాపరహిత వ్యభిచారసందర్భముననుగాని, సప్తపదికిఁబూర్వము క్లీబత్వాదులు తెలి

# ధర్మసిద్ధాన్తసంగ్రహశోధనపత్రము.

—:o:—

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. | పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 5 | 12 | గాదు | గాదని తెలియు | 31 | 1 | ఆచార | ఆచార్య |
| | | | చున్నది. | 33 | 1 | సృజత...సృజత | సృజత, 11... |
| 5 | 25 | శ్యానాం | క్షైశ్యానాం | | | ...సృజత...బృహ.ఉ సృజత,... 12... | |
| 9 | 18 | శంఖ | శాంఖ | | | | సృజత...13.బృహ. |
| 0 | 3 | జ్ఞాతీయుఁడు | జ్ఞాతుఁడు | | | | ఉ. 3-4. |
| 1 | 6 | యాత్వ | యాత్మ | 33 | 4 | యే యని | యే యర్థమని |
| 4 | 16 | స్వతస్సిద్ధ | యాంతరీయక | 34 | 20 | ఇయంగౌరగౌః | ధేనురపి గౌరగౌ |
| 5 | 14 | తూచే...న్నరః మూలే...ద్విజః | | | | | రిత్యుచ్యతే |
| 8 | 20 | విద్యావి | విద్యాది | 37 | 21 | ముఖుఁడ... | ముఖుల...నింద్యుల |
| 8 | 25 | దశమహా | దశీ మాహా | | | నింద్యుఁడ | |
| 9 | 7 | వృతం | వృతగ్ం | 41 | 8 | మున్నగున | మున్నగువార |
| 9 | 10 | హాస్య | హ్యాస్య | 48 | 25 | నిశ్చయముచేయ | నిర్ణయింప |
| 9 | 27 | మ్యర్థే। | మ్యర్థే। బ్రాహ్మణః | 51 | 7 | త్వాది | త్వాదులు |
| 0 | 1 | మానిబ్రహ్మ | మానీ | 51 | 9 | చుచుండ | పంబడియుండ |
| 3 | 15 | యహాణిపా | పరిగృహీతపరమేష్ఠి | 52 | 15 | మెట్లు | ముగనెట్లు |
| | | దుఁడుగ | స్వరూపుఁడై సపా | 56 | 20 | త్వాది | త్వాధి |
| | | | ణిపాదుఁడుగను,స్వ | 62 | 3 | భావత్వ | భావ |
| | | | రూపమాత్రుఁడైయ | 64 | 1 | యజు | ఈయజు |
| | | | పాణిపాదుఁడుగను | 70 | 25 | ముగ | మగు |
| | 2 | నహ్యాచే...శక్తమ్ | నహి నిరాత్మకం | 70 | 26 | మీ | నని |
| | | భ.గీ. శాం...ము. | కించిద్భూతం వ్యవ | 71 | 16 | విధిలక్షిత | విధ్యపేక్షిత |
| | | | హారాయ కల్పతే, | 77 | 4 | త్రియ | త్రియము |
| | | | భ.గీ.9-4 శాం.భా. | 81 | 18 | కి(స్త్రీ) | కీ(స్త్రీ) |
| | | | దృశికర్మత్వాపత్తి | 83 | 30 | వే ఇట్టి | ఇట్టి |
| | | | నిమిత్తాహి సర్వాప్ర | 85 | 6 | ఇట్లుగాక | ఇట్లుగాక "పతే" |
| | | | వృత్తిః. భ. గీ. 9-10 | | | | అనుదాని నార్థప్రి |
| | | | శాం. భా. | | | | యోగమని యొప్పి |
| 29 | 3 | తండ్రుల | తలిదండ్రుల | 85 | 11 | యాన | యాఽవ |